

# సులక్షణసారము

## తాత్పర్యోదాహరణసహితము.





### ఉపోద్ఘాతము.

రామా స్తనమండలీమిళితకా
శ్మీరార్ద్రవక్షంబుతోఁ
బారావారతరంగసంగతలస
త్పర్యంకనాగంబుపైఁ
గారుణ్యామృతపూరపూరితకటా
క్షశ్రీలఁ బెంపొందు గం
భీరస్వాంతుఁ డనంతుఁ డాశ్రితజనా
భీష్టప్రదుం డయ్యెడున్. 1

అవతారిక.—కవిశిరోమణియగు తాతంభట్టు సులక్షణసారమను ఛందోగ్రంథమును రచియింపఁ బూని, తా రచింపనెంచిన గ్రంథము నిర్విఘ్నముగ నెఱవేఱుటకై, తొల్లింటికవుల యాచారము ననుసరించి, గ్రంథాదియం దాశీర్వాదరూపమగు మంగళమును జేయుచున్నాఁడు.—

తా. శ్రీలక్ష్మీదేవిని గట్టిగఁ గౌఁగిలించి, పాల్కడలియం దాదిశేషుఁ డనుపాన్పుపైఁ బరుండి, భక్తులను గరుణతోఁ జూచుచు వారికోర్కెలీడేర్చునట్టియమ్మహాదాతయగు నాద్యంత రహితుఁడైన శ్రీమన్నారాయణమూర్తి జనులకోరికల నెల్ల నొసంగుఁ గాత.

## ⟶ ఛందోమహిమ. ⟵

అవతారిక.—గ్రంథకర్త ఛందోమహిమను దెల్పుచున్నాఁడు.—

క. విద్యలలోపల నుత్తమ
విద్య గవిత్వంబు మఱి క♦విత్వము ఛందో
వేద్యము గావునఁ జెప్పెద
హృద్యంబుగఁ గవితచంద♦మేర్పడఁ గృష్ణా 2

తా. ఓ శ్రీకృష్ణా! విద్య లన్నింటిలో శ్రేష్ఠమగువిద్య కవిత్వము. అట్టికవిత్వము ఛందశ్శాస్త్రమువలననే తెలియనగును. గావునమిక్కిలిసులభముగాఁ గవిత్వముచేయుశక్తి గలుగునట్లు ఛందోగ్రంథమును జెప్పెదను.

అవ.—గ్రంథకర్తకవిత్వమహిమను, ఛందశ్శాస్త్రప్రభావమును దెల్పి, తానురచింపఁబోవుగ్రంథనామమును,తనకాగ్రంథముఁజేయుటకుఁగలనేర్పుగల్గినవిధంబును దెల్పుచున్నాఁడు.—

క. లక్షణశాస్త్రము లెల్లఁ బ
రీక్షించుటఁ గొంతకొంత♦యెఱిఁగినవాఁడన్
లాక్షణికానుగ్రహిత సు
లక్షణసారము రచింతు♦ లక్ష్యము లమరన్. 3

తా. నేను ఛందశ్శాస్త్రమెల్లఁ జదివి, లక్షణ గ్రంథముల నెల్లఁ బరికించి, కొంచెముకొంచె మెఱిఁగి యున్నాను. ఆపరిచయమువలనను, చందోగ్రంథములను రచియించిన వారిదయ వలనను నేనిపుడు సులక్షణసారమను పేరు గలలక్షణగ్రంథమును జేయఁబూనితిని.

అవతారిక.—ఇతరలక్షణగ్రంథములకంటెఁ దనగ్రంథమునకుఁ గలప్రాశస్త్యము నీక్రిందిపద్యముచేఁ దెల్పుచున్నాఁడు.

తే. కొంద ఱెంచెదురీతులఁ • గొంద ఱెంచ
రం(శ)ములను జెప్పినవి గొన్ని • యవియు నవియు
దొరయఁగాఁ గూర్చి కవిసమ్మ•తులును వ్రాయ
నుక్తలక్ష్యాస్పదంబు లాం•ధ్రోక్తు లెనయ. 4

తా. ఇంతకు మున్ను లక్షణగ్రంథము రచించినవారిలోఁ గొందఱు చెప్పినవి మఱికొంద ఱొప్పికొనలేదు. కావున నేను వారిలక్షణగ్రంథంబులను గొన్నింటిని నింక ననేకగ్రంథంబులను బరిశీలించి, తెనుఁగుభాషలోనిలక్ష్యలక్షణములకుఁ బొందిక యగునట్లు, సకలలాక్షణికసమ్మతంబుగా నీసులక్షణసారంబు రచియింపఁబోవుచున్నాఁడను.

# సంజ్ఞాప్రకరణము.

## మాత్రాలక్షణము.

క. మాత్ర యన నొక్కలఘు వగు
మాత్రలు రెండైన గురువు•మఱి యెన్నఁబడున్

ధాత్రినినఱువదినాలుగు
మాత్రలుగాఁ గందమునకు♦మాత్రలు వెలసెన్.5

తా. మాత్ర యనఁగాఁ జిటికవేయునంతకాలము. అ—ఇది ఒకమాత్రలోనుచ్చరింపఁదగును గాన లఘువు అనఁబడును. రెండుమాత్రలకాలములో నుచ్చరింపఁబడువర్ణము గురు వనఁబడును. ఆ. కందపద్యమున కఱువదినాలుగు మాత్రలు గలవు.

→ గురులఘువులస్వరూపము. ←

క. వివిధముగఁ జాఁపి పలికెడు
నవియునుమఱియూఁదిపలుకు♦నవియునుగురువుల్
భువి నిలిపి పలుకువర్ణము
లవియెల్లను లఘువులయ్యె♦*[నంబుధిశయనా.]

తా. దీర్ఘాచ్చులును,దీర్ఘాచ్చులతోఁగూడినహల్లులునుగురువు లనఁబడు. ఉదా,—ఆ, ఈ. ఊ, కా, కీ, కూ మొదలైనవి. నిలిపి పలుకఁబడువర్ణంబులు లఘువు లనఁబడు. ఉదా.—అ, ఇ, ఉ, క, కి, కు. కృ, మొదలైనవి. ఒకమాత్రకాలములో నుచ్చరింపఁబడునది లఘువు. రెండుమాత్రలకాలములో నుచ్చరింపఁబడునది గురువు.

మఱియు:—

క. గురువులు:—నిడుదలు, జడ్డ
క్కరములు, బొట్టులు, పిఱుంద♦కడ నూఁదినయు

---

*"అంబుధిశయనా" అనుపదము కవికృతేష్టదేవతాసంబోధనము. దీనికిచ్చట నేమియు సంబంధము లేదు. కాన ఇదికుండలీకృతమైనది ఇట్లే పైపద్యములందు ననియెఱుంగవలయు.

క్కరములు; పెఱయవి లఘువులు;
గురులఘువులుమూఁడుగూడి కొనగణములగున్. 7

తా. దీర్ఘములైనయచ్చులును; దీర్ఘములైన అచ్చులతోఁ గూడినహల్లులును, సంయుక్తాక్షరములకు (ఒక హల్లుక్రిందనొకహల్లు- క్త, క్వ, ష్ణ, ఇట్లు కలసినయక్షరములకు) ముందున్న యక్షరములును, న్, (ణ్) ల్, ర్, మొదలగు పొల్లుహల్లులతోఁగూడిన హ్రస్వాక్షరములును, అనుస్వారమునకు ముందున్న హ్రస్వాక్షరములును, గురువు లనఁబడును. తక్కినవి (తలకట్టు, గుడి, కొమ్ము, వట్రువసుడి మొదలగువానితోఁ గూడినహల్లులు) లఘువు లనఁబడును.

ఉదా.—ఆ, కా, రక్తము, చందము, వనముణ్, వనముల్, పెత్తుర్; దుఃఖము—క్రింద గీఁతలు గలవి గురువులు. అ, క, కృ ఇవి లఘువులు.

ఇట్టి లఘువులు మూఁడుగాని, గురువులు మూఁడుగాని, గురువులు లఘువులు కలసిమూఁడుగాని చేరినయెడల నదియొకగణ మనఁబడును. గణములలోఁ గొన్ని యైదక్షరములు, కొన్ని నాలుగక్షరములు, కొన్ని రెండక్షరములు, కొన్నియొక్కటె యక్షరము గలవియై యున్నను, అవి యన్నియు నుపగణము లనఁబడు. ప్రధానగణము లెనిమిది. వానికి మూఁడే యక్షరములు గలవు గాని యెచ్చుతక్కువలు లేవు.

## గురులఘువులకు గుఱుతులు.

క. గురువులకు సంజ్ఞ యొక్క-
ట్లరయం దలక్రిందు వ్రాయునట్టులం జెలఁగుఁ

ధరపై లఘువులు వెలయున్
గరిమన్ నిడుగీటు వ్రాయు కరణి [ముకుందా]. 8

తా. మనము తెనుఁగుభాషలో వ్రాయు ఁ (ఒకటి) అను సంఖ్యను ౮ ఇట్లు తలక్రిందుగా వ్రాసితిమేని యీగుఱుతు గురువును దెలుపును. । ఇట్లు పాతికవలె నిడుపుగీత యొక్కటి గీచితిమేని, యది లఘువనంబడు. అనఁగా:

ఁ ఈచిహ్నము గురువును దెలుపును }
। ఈచిహ్నము లఘువును దెలుపును }

అని ముఖ్యాభిప్రాయము.

## సమ (ప్రధాన) గణములు.

క. గురువులు మూఁడిడ మగణము
పరగంగా నాదిగురువు భగణం బయ్యెన్
ధర మధ్యగురువు జగణము
[సరసగుణా] యంత్యగురువు సగణం బయ్యెన్. 9

క. నగణంబు మూఁడులఘువులు
యగణంబున కాదిలఘువు [యమతనయసిభా]
రగణంబు మధ్యలఘు వగు
తగణంబున కంత్యలఘువు [దాక్షిణ్యనిధీ.] 11

తా. సమగణములు మూఁడేసియక్షరములు గలవియని ముందటిపద్యమునకుఁ జెప్పఁబడియె. అట్టిగణము లెనిమిది.

1 మగణము=మూఁడు అక్షరములు గురువులుగాఁ గలది.

2 భగణము= ఆద్యక్షరము గురువుగాఁ గలది.

3. జగణము=మధ్యాక్షరము గురువుగాఁ గలది.

4. సగణము=అంత్యాక్షరము గురువుగాఁ గలది.

5. నగణము=మూఁడక్షరములు లఘువులుగాఁ గలది.

6. యగణము=ఆద్యక్షరము లఘువుగాఁ గలది.

7. రగణము=మధ్యాక్షరము లఘువుగాఁ గలది.

8. తగణము=అంత్యాక్షరము లఘువుగాఁ గలది.

మూఁడక్షరములగణములకు ఉదాహరణము.

అవ. ఇంక నీయెనిమిదిగణంబుల కుదాహరణంబులఁ జూపుచున్నాఁడు.—

క. మగణము శ్రీనాథా యన
భగణము కేశవ యనంగఁ ♦ బరికింపఁ దుదిన్
జగణము ముకుందయనఁగా
సగణము వరదా యనంగ ♦ [సర్వజ్ఞనిధీ]. 12

క. నగణము వరద యనంగా
జగతి మురారీ యనంగఁ ♦ జను యగణంబున్
రగణంబు మాధవా యనఁ
దగణము దైత్యారి యనఁగ ♦ [దామరసాక్షా].

మగణము=ఉదా—శ్రీనాథా (అన్ని యక్షరములుగురువులు)

భగణము=ఉదా—కేశవ (మొదటియక్షరము గురువు).

జగణము=ఉదా—ముకుంద (రెండవయక్షరము గురువు).

N. B. సున్నకు ముందుండు హ్రస్వము గురువని జ్ఞప్తికి దెచ్చుకొనవలయును.

సగణము=ఉదా—వరదా (కడపటియక్షరము గురువు).

నగణము=ఉదా—వరద (మూఁడక్షరములు లఘువులు).

యగణము=ఉదా—మురారీ (మొదటియక్షరము లఘువు).

రగణము=ఉదా—మాధవా (నడిమియక్షరము లఘువు).

తగణము=ఉదా—దైత్యారి (కడపటియక్షరము లఘువు).

ఈగణములను సులువుగాఁ దెలిసికొనుటకై యీ క్రింది చక్రమును జక్కఁగా గ్రహింపుఁడు.

| సంఖ్య | గణముల పేర్లు | గురుతు. | | | ఉదాహరణము. | లక్షణములు. |
|---|---|---|---|---|---|---|
| | | మొ. | న. | క. | | |
| 1. | మ | U | U | U | శ్రీనాథా | అన్ని అక్షరములు గురువులు. |
| 2. | భ | U | I | I | కేశవ | కే=గు; శ=ల; వ=ల. |
| 3. | జ | I | U | I | ముకుంద | ము=ల; కుం=గు; ద=ల. |
| 4. | స | I | I | U | వరదా | వ=ల; ర=ల; దా=గు. |
| 5. | న | I | I | I | వరద | అన్ని అక్షరములు లఘువులు. |
| 6. | య | I | U | U | మురారీ | ము=ల; రా=గు; రీ=గు. |
| 7. | ర | U | I | U | మాధవా | మా=గు; ధ=ల; వా=గు. |
| 8. | త | U | U | I | దైత్యారి | దై=గు; త్యా=గు; రి=ల. |

## రెండక్షరముల గణములు.

క. లలమునకు రెండు లఘువులు
వల నొప్పఁగ లఘువు గురువు • వగణం బయ్యెన్
గల మయ్యె గురువు లఘువును
[జలజాక్షా]గగ మనంగఁ • జను గురుయుగమున్.

తా. లల మనఁగా రెండులఘువులు గల గణము. లగ మనఁగా మొదటలఘువు, పిదప గురువును గల గణము. గల మనఁగా మొదట గురువు, పిదప లఘువును గల గణము. గగ మనఁగా రెండు గురువులు గల గణము.

| గణము. | గురుతు. | ఉదా. | వివరణము. |
|---|---|---|---|
| లల= | \| \| | నర | లఘువు, లఘువు |
| లగ=(వ) | \| ᑌ | కదా | లఘువు, గురు |
| గల=(హ) | ᑌ \| | కాదు | గురువు, లఘువు |
| గగ= | ᑌ ᑌ | కాదా | గురువు, గురువు |

వీనిలో \| ᑌ=లగమునకు వగణమనియు, ᑌ \|= గలమునకు హగణమనియు వేఱుపేళ్లు గలవు.

## రెండక్షరములగణముల కుదాహరణము.

క. శౌరి యనిన హాగణం బగుఁ
జేరి హరీ యనిన నుల్ల • సిల్లును వగణం
బారయఁ గృష్ణా యనినను
ధారుణి గగ మండ్రు లలము • దా హరి యన్నన్.

హగణము / లేక, గలము } =ఉదా-శౌరి (మొదటియక్షరముగురువు).

వగణము / లేక; లగము } =ఉదా-హారీ (కడపటియక్షరము గురువు).

గగము=ఉదా—కృష్ణా (రెండును గురువులు).

లలము=ఉదా—హరి (రెండును లఘువులు.)

| సం. | గణముల పేళ్లు. | గుఱుతు. | | ఉదాహరణము. | లక్షణము. |
|---|---|---|---|---|---|
| 1. | గలము | ∪ | \| | శౌరి | శౌ=గు; రి=ల. దీనికిహగణమని పేరు గలదు. |
| 2. | లగము | \| | ∪ | హారీ | హా=ల; రీ=గు. దీనికి వగణమని పేరు గలదు. |
| 3. | గగము | ∪ | ∪ | కృష్ణా | కృ=సంయుక్తాక్షరమునకు ముందక్షరము గనుక గురువు; ష్ణా=గురువు. |
| 4. | లలము | \| | \| | హరి | హరి=రెండును లఘువులు. |

క. నగణముపయి గురు వున్నన్
నగ మగు లఘువున్నయెడల•నల మగువరుసన్
సగణముపయి లఘు వున్నన్
దగ సల మగుఁ [గంజహితసు•ధాకరనయనా.]

తా. నగణసగణములకు లక్షణము తెలిసియున్నదిగదా. ల యనఁగాలఘువనియు, గ యనఁగా గురువనియుఁ దెలియవల

యము. నగణముమీఁద లఘువున్నయెడల నలమనియు, నగణము మీఁద గురువున్నయెడల నగ మనియు, సగణముమీఁద లఘువున్నయెడల సల మనియుఁ జెప్పఁబడు.

నలము= | | | | = నాలుగులఘువులు = ఉదా—పదనము.

నగము= | | | ∪ = ల, ల, ల, గ=ఉదా—జలధరా.

సలము= | | ∪ | = ల, ల, గ, ల=ఉదా—మనుజుండు.

## ఇంద్రసూర్యచంద్రగణంబులు.



క. నల, నగ, సల, భ, ర, తలు నా
నెలమినినీ యాఱుగణము • లింద్రగణంబుల్;
గల, నగణము లీరెండును
జలజాప్తగణంబు లయ్యె • [జగదాధారా]. 16

క. గల, నగణము లినుఁ; డిందుఁడు
నల, నగ, సల, భ, ర, త; లింక • నగగ, నహా, సలా,
భల, భగురు, మలఘు, సవ, సహా,
తల, రల, నవ, నలల, రగురు • తగ, లిందు[illegible] [ధరా]

## సూర్యగణములు.

1. హగణము ∪ |
2. నగణము | | |

## ఇంద్రగణములు.

1. నగ | | | ∪
2. నల | | | |
3. సల | | ∪ |
4. భ ∪ | |
5. ర ∪ | ∪
6. త ∪ ∪ |

## చంద్రగణములు.

1. నగగ = | | | U U
2. నహ = | | | U |
౩. సలల = | | U | |
4. భల = U | | |
5. భగురు = U | | U
6. మలఘు = U U U |
7. సవ = | | U | U
8. సహ = | | U U |
9. తల = U U | |
10. రల = U | U |
11. నవ = | | | | U
12. నలల = | | | | |
13. రగ = U | U U
14. తగ = U U | U

### వీనికి వరుసగా నుదాహరణములు.

1. నగగ=వరదుఁ డిచ్చున్
2. నహ=వరములెల్ల
3. సలల=తిలకించిన
4. భల=రామునకు
5. భగురు=రామునకున్
6. మలఘు=సీతేశుండు
7. సవ=హరిదాసునిన్
8. సహ=జలజాతాక్ష
9. తల=గోపాలుఁడు
10. రల=దేవదేవ
11. నవ=వరదుఁడుదాన్
12. నలల=సురభినుత
13. రగ=దేవదేవా
14. తగ=గోవిందుఁడా

క. గగణంబగు నేకగురువు
లగణంబగు నేకలఘువు లాలిత మనఁగా
వగణ మగు లఘువు గురువును
హగణంబగు గురువులఘువు [హరిభక్తపరా].

తా. రెండుగురువులు గగ మనియు రెండులఘువులు లల మనియుఁ దెలియఁదగినది. (ఈపద్యములోని విషయము ముందే

వివరింపఁబడియున్నది. అయినను మరలఁ బ్రస్తావానుసారం బుగ నిచ్చట వివరింపఁబడుచున్నది). ఒకగురువు 'గ' గణము అనియు, ఒకలఘువు 'ల' గణమనియుఁ జెప్పఁబడును. రెండు గురువులు, 'గగ' మనఁబడును. రెండు లఘువులు 'లల' మనఁ బడును. 'గా' 'లా' యని దీర్ఘములుగాఁ జెప్పినను రెండు గురువులు, రెండు లఘువులని యర్థము చేసికోవలెను. మొదటి యక్షరము లఘువును రెండవయక్షరము గురువును నైనయెడల 'వ' గణమనఁబడు. మొదటి యక్షరము గురువును. రెండవ యక్షరము లఘువును నైనచో 'హ' గణ మనఁబడును.

ఇది సులక్షణసారం బను ఛందశ్శాస్త్రంబునందు గురులఘుగణస్వరూపనిరూపణం బనుసంజ్ఞా ప్రక రణము.

---

అవ.—ఇఁక వృత్తగణప్రస్తారమును వృత్తలక్షణంబులును జెప్పుచున్నాఁడు. అందు మొదట సామాన్యంబుగఁ బ్రస్తార లక్షణంబుఁ జెప్పుచున్నాఁడు.—

వృత్తగణప్రస్తారము.

క. చాలుగను సర్వగురు లిడి
లాలితముగ గురువుక్రింద ♦ లఘువు వెలపటఁ
జాలి సమంబులు దాపలి
వాలికకు గురువులను నిల్పఁ ♦ బ్రస్తారముగున్. 19

తా. ఎన్నవఛందమునకుఁ బ్రస్తారము వేయవలయునో యన్ని గురువులు వరుసగాఁ బెట్టుకొని యావరుసలో మొదటి గురువుక్రింద లఘువుం బెట్టుకొని, దాని ప్రక్కనున్న గురువుల క్రింద గురువులె పెట్టుకొనఁగా రెండుబంతు లేర్పడును గాన నా రెండవవరుసలో మొదటిగురువు ఎద్దియో దానిక్రిందఁ దిరుగ లఘువుం బెట్టికొని, వెలుపల నున్న గురువుల కన్నింటికిని గురువులం బెట్టి, దాపల నున్నలఘువుక్రింద గురువు పెట్టవలయు. ఇట్లేర్పఱచుకొని, యేవరుసలోనైనను మొదటి గురువుక్రింద లఘువు పెట్టుకొని వెలుపల గురువుక్రింద గురువును లఘువు క్రింద లఘువును బెట్టుకొని దాపల నున్న లఘువులక్రింద గురువులు పెట్టుకొనవలయును. ఈప్రకారము సర్వము లఘువు లగు వఱకును బ్రస్తరింపవలయు నని తాత్పర్యము.

అవ. గణలక్షణమునకు వివరణము చెప్పుచున్నాఁడు.—

క. ఎన్నవఛందం బడిగిన
నన్నియ గురులిడుచు మఱిగణాష్టకమును దాఁ
బన్నుచు లఘువులె తుదగా
నెన్నిక నిడ వృత్తసంఖ్య యేర్పడవచ్చున్. 20

తా. ఎవ్వరైన నెన్నవఛందమును బ్రస్తరింపు మని యడిగినచో, నన్నిగురువులు మున్ను చెప్పిన "చాలుగను సర్వగురువులు" అనుపద్యముప్రకారముప్రస్తరింపఁగా, మొదటిఛందస్సునకు రెండు, రెండవఛందస్సునకు నాలుఁగు, మూఁడవ

ఛందంబున కెనిమిది యివ్విధంబునఁ బైనిచెప్పఁబోవుతీరున నొక్కొక్కఛందంబున నన్నివృత్తంబులు పెరుఁగుచుండును.

## సూర్యేంద్రచంద్రగణములయుత్పత్తి.

క. ద్విత్రిచతుర్గురుభవములు
[ధాత్రీధర] రెండు మడుపఁ • దక్కినగణముల్
మిత్రేంద్రచంద్రు లనఁదగు
మాత్రాదిగణంబు మొదల•మాత్ర లిడంగన్.

తా. రెండవ, మూఁడవ, నాలవగణంబులవలనఁ బుట్టిన గణములు పైరెండువరుసలుదక్కఁ దక్కినవి లఘువులు పెట్టిన వరుసగా సూర్య, ఇంద్ర, చంద్రగణము లగును.

వృత్తగణప్రస్తారము ప్రస్తరించి చూపఁబడు చున్నది.

### మొదటిఛందము.

| | | |
|---|---|---|
| చాలుగను సర్వగురు లిడి | 1. | ບ |
| లాలితముగ గురువుక్రింద లఘువు | 2. | । |

### రెండవఛందము.

| | | |
|---|---|---|
| చాలుగ ... | 1. | ບບ |
| లాలితముగ గురువుక్రింద లఘువు | 2. | ।ບ |
| దాపలి వ్రాలకును గురువు | 3. | ບ। |
| వెలుపల నోలి సమంబులు | 4. | ।। |

## మూఁడవఛందము.

చాలుగ
గురువుక్రింద లఘువు
వెలుపలనోలిసమంబులు

| | |
|---|---|
| 1. U U U | 5. U U \| |
| 2. \| U U | 6. \| U \| |
| 3. U \| U | 7. U \| \| |
| 4. \| \| U | 8. \| \| \| |

## నాలుగవఛందము.

| | | |
|---|---|---|
| 1. U U U U | 6. \| U \| U | 11. U \| U \| |
| 2. \| U U U | 7. U \| \| U | 12. \| \| U \| |
| 3. U \| U U | 8. \| \| \| U | 13. U U \| \| |
| 4. \| \| U U | 9. U U U \| | 14. \| U \| \| |
| 5. U U \| U | 10. \| U U \| | 15. U \| \| \| |
| | | 16. \| \| \| \| |

## అయిదవఛందము.

| | | |
|---|---|---|
| 1. U U U U U | 12. \| \| U \| U | 23. U \| \| U |
| 2. \| U U U U | 13. U U \| \| U | 24. \| \| \| U \| |
| 3. U \| U U U | 14. \| U \| \| U | 25. U U U \| \| |
| 4. \| \| U U U | 15. U \| \| \| U | 26. \| U U \| \| |
| 5. U U \| U U | 16. \| \| \| \| U | 27. U \| U \| \| |
| 6. \| U \| U U | 17. U U U U \| | 28. \| \| U \| \| |
| 7. U \| \| U U | 18. \| U U U \| | 29. U U \| \| \| |
| 8. \| \| \| U U | 19. U \| U U \| | 30. \| U \| \| \| |
| 9. U U U \| U | 20. \| \| U U \| | 31. U \| \| \| |
| 10. \| U U \| U | 21. U U \| U \| | 32. \| \| \| \| \| |
| 11. U \| U \| U | 22. \| U \| U \| | |

(ఇట్లే తక్కినఛందస్సులను ప్రస్తరించుకొనఁదగు.)

ఇంక గణప్రస్తారము చూపఁబడుచున్నది.

U U { రెండవఛందంబునం బుట్టినసూర్యగణములు.
I I { పై నున్న రెండు విడిచిపెట్టఁగా.

U I ఇది గలము.

I U ఇది లగము.

I I I ఇదిమాత్రాదిగణము గాన దీనిమొదట మాత్ర పెట్టవలయును. (మాత్ర యనఁగా లఘు వని యర్థము.)

ఇంక మూఁడవఛందస్సునం బుట్టినయింద్రగణ ప్రస్తారము.

U I U ఇది మధ్యలఘువుగాన రగణము.

I I I U ఇది యంత్యగురువుగాన నగము.

U U I ఇది యంత్యలఘువుగాన తగణము.

I U I ఇది యంత్యలఘువు గాన సలము.

U I I ఇది యాదిగురువు గాన భగణము.

I I I I ఇది యంత్యలఘువుగాన నలము.

ఇంక నాలవఛందస్సునందుఁ బుట్టిన చంద్ర గణములు.

U U U U } పై రెండును విడిచిపెట్టఁగా
| U U U }

U | U | U ఇది రగణముమీఁద లఘువుగురువుగాన రలగము.

| | | U U ఇది నగణముమీఁద రెండుగురువులుగాననగగము.

U U | U ఇది తగణముమీఁద గురువుగాన తగము.

| | U | U ఇది సగణముమీఁద లఘువు గురువుంగాన సలగము.

U | U ఇది భగణముమీఁద గురువుగాన భగురువు.

| | | | U ఇది నగణముమీఁద లఘువుం గురువుం గాన నలగము.

U U U | ఇది మగణముమీఁద లఘువుగాన మలఘువు.

| | U U | ఇదిసగణముమీఁద గురువు లఘువుంగాన సగలము.

U | U | ఇది రగణముమీఁద లఘువుగాన రలము.

U | | U | ఇది భగణముమీఁద గురువు లఘువుంగాన భగలము.

U U | | ఇది తగణముమీఁద లఘువుగాన తలము.

| | U | | ఇది సగణముమీఁద రెండులఘువులు గాన సలలము.

| | | | | ఇది నగణముమీఁద రెండులఘువులు గాన నలలము.

## కందపద్యలక్షణము.

క. కందము త్రిశరగణంబుల
నందము గా భజస నలము • లట వడి మూఁటన్

బొందును నలజల నాజిట
నొందుం దుద గురువు జగణ మొందదు బేసిన్.

తా. తెలుచుగాఁ బద్యమునకు నాలుగుపాదములుగలవు కందపద్యమున మొదటిపాదమునకు మూఁడుగణములును, రెండవపాదమున కయిదుగణంబులును నుండవలయును. అట్లే మూఁడవపాదంబునకు మూఁడుగణంబులును, నాలవపాదమున కయిదుగణములు నుండనలయును, ఈపైఁ జెప్పినయైనిమిది యు (1) గగ, (2) భ, (3) జ, (4) స, (5) నలము లను గణములలో నేవి యైనను నుండవలయును. ఆఱవగణము 'నల' 'జ' గణంబులలో నొక్కటిగా నుండవలయును. రెండవపాదముయొక్కయు, నాలవపాదముయొక్కయుఁ గడపటియక్షరము గురువుగా నుండనలయును. మొదటిది, మూఁడవది, అయిదవది, యేడవది యగుగణంబులు జగణములుగా నుండఁగూడదు. రెండవపాదమునను నాలుగవపాదమునను నాలుగవగణము యొక్క మొదటియక్షరము *యతిగా నుండనలయును.

| | | |
|---|---|---|
| 1. భ U I I | 3. స, I I U | 5. నల. I I I I |
| 2. జ, I U I | 4. గగ, UU | వీనిలో నొక్కటిగా నుండవలెను. |

* యతియన నిట్టిదనువిషయము పైనఁ జెప్పఁబడుగాన నిచ్చట వివరింపఁబడదయ్యె.

ఈ కందపద్యముయొక్క లక్షణము బాగుగఁ దెలియుటకై పైపద్యమును విభజించి చూపుచున్నాను.

| | | | | | |
|---|---|---|---|---|---|
| మొ.పా. | 1. భగణము కందము | 2. నల త్రిశరగ | 3. భగణము ణంబుల | | |
| రెం.పా. | 4. భగణము నందము | 5. భగణము గా భజ | 6. నల సనలము | 7. నలము లటపడి | 8. గగ మూఁటన్ |

(మొదటి పాదమునకు మూఁడుగణములు.)

పైపద్యములో 6వ గణము 'నల' 'జ' గణములలో నొక్కటిగా నుండవలెనని చెప్పినచొప్పున 'నలము, గా నున్నది. 1, 3, 5, 7, అను బేసిగణములలో జగణము లేదు. రెండవపాదముకడపట 'టన్' అని గురు వున్నది. చుక్కకుఁ బ్రక్కన నున్న నాలవగణముయొక్క మొదటి యక్షరము 'అ' అనునది యతియైయున్నది. ఇట్లే మూఁడునాలుగుపాదములకు వరుసగా మొదటి రెండవపాదముల లక్షణము లుండునని యెఱుఁగవలయు. ఈకందపద్యలక్షణముఁ దెలియుటకై బాలురు తమ పాఠగ్రంథములనుండి పదికందపద్యములకు గణవిభాగము చేయవలయు.

## గీతపద్య లక్షణము.

ఆ. గీ. ఇనగణత్రయంబు ♦ నింద్రద్వయంబును
హంసపంచకంబు ♦ నాటవెలఁది
సూర్యుఁ డొక్కరుండు ♦ సురరాజు లిద్దఱు
దినకరద్వయంబు ♦ తేటగీతి. 23

తా. గీతములు సామాన్యముగా ఆఁటవెలఁది గీతమనియు, తేటగీతమనియు, రెండు తెఱంగులై యుండు. అందు ఆటవెలఁది గీతమును ఆఁటవెలది యని కూడ వ్యవహరింతురు. ఈపద్యంబున నీరెండింటికి లక్షణము చెప్పఁబడినది. గీతపద్యములలో నొక్కొక్క పాదమునకై దేసిగణము లుండవలయును. ఆటవెలఁదికి మొదటిపాదమున మొదట మూఁడుసూర్యగణంబులును, వానికిఁ బిమ్మట రెండింద్రగణంబులును; రెండవపాదమున నైదు సూర్యగణంబులు నుండవలయు. మొదటిపాదముయొక్క లక్షణము మూఁడవపాదంబునకును, రెండవపాదముయొక్క లక్షణము నాలవపాదంబునకు నుండును.

తేటగీతమున నొక్కొక్క పాదమునకును మొదట నొక్కసూర్యగణమును, దానికి వెనుక రెండింద్రగణంబులును, వానికిఁ బిదప రెండుసూర్యగణంబులు నుండును.

ఈ ఆటవెలఁది, తేటగీతములకు రెండింటికిని బ్రతిపాదమునను నాలవగణముయొక్క మొదటియక్షరమున యతి చెల్లును. వీనికిఁ బ్రాసనియమంబు లేదు.

ఈరెండుపద్యముల లక్షణము దృఢముగాఁ దెలియుటకై యీ క్రిందిపద్యములకు గణవిభజన చేయుచున్నాను.

ఆటవెలఁది.

| | | | | | |
|---|---|---|---|---|---|
| సూ. గ.<br>నగణము<br>ఇనగ<br>1. | సూ. గ.<br>గలము<br>ణత్ర<br>2 | సూ. గ.<br>గలము<br>యంబు<br>3 | ఇంద్ర. గ.<br>తగణము<br>నింద్రద్వ<br>4 | ఇంద్ర. గ.<br>భగణము<br>యంబును<br>5 | (మొదటి<br>పాదము) |
| సూ. గ.<br>గలము<br>హంస<br>1 | సూ. గ.<br>గలము<br>పంచ<br>2 | సూ. గ.<br>గలము<br>కంబు<br>3 | సూ. గ.<br>గలము<br>నాట<br>4 | సూ. గ.<br>నగణము<br>వెలది<br>5 | (రెండవ<br>పాదము) |

మొదటి పాదమున 'ఇ' కారమునకు 'నిం' అను నాలుగవ గణము మొదటి యికారమునకును, రెండవపాదమున 'హ' కారమునకును నాలవగణము మొదటి యక్షరమైన యాకారమునకును యతి చెల్లును. ఇట్లే తక్కిన మూఁడవ నాలుగవపాదముల లక్షణంబు నెఱుంగవలయును.

మూఁడవపాదము—3 సూర్యగణములు,—2 ఇంద్రగణములు; నాలుగవపాదము—5 సూర్యగణములు.

తేటగీతి.

జడలు దాలిచి తపసుల•చందమునను
దమ్ముఁడును దాను ఘోరదు•ర్గమ్ములందుఁ

గూరగాయలు [illegible] ♦ గుడుచునట్టి
రాముఁ [illegible] ♦ [illegible]గలండు. 24

| | | | | | |
|---|---|---|---|---|---|
| సూ. గ. | ఇం. గ. | ఇం. గ. | సూ. గ. | సూ. గ. | |
| నగణము | భగణము | నలము | గలము | నగణము | (మొదటి |
| జడలు | దాలిచి | తపసుల | చంద | మునను | పాదము) |
| 1 | 2 | 3 | 4 | 5 | |

ఇందు మొదటిపాదములోని మొదటి 'జ' కారమున కును, నాలవగణమున 'చ' కారమునకును యతి. ఇట్లే తక్కిన మూఁడుపాదములకు నని యెఱుంగ వలయును.

సీసపద్య లక్షణము.

ఇంద్రగణములాఱు ♦ నినగణంబులురెండు
నాదపాదమునను ♦ బరఁగు చుండు
నాటవెలఁది యైనఁ ♦ దేటగీతియునైనఁ
జెప్పవలయు మీఁద ♦ సీసములకు. 25

తా. సీసపద్యమునకు నాలుగు పాదములు గలవు. ఒక్కొక్కపాదమునకు నెనిమిదేసి గణము లుండవలయు. వాని లో మొదటియాఱు నింద్రగణంబులు; తక్కినవి రెండు సూర్య గణంబులు. ఇట్లు నాలుగుపాదములు సెప్పవలయును. పిదప నాటవెలఁదియైనను, దేటగీతియైనను జెప్పవలయును. దీనికి యతిగాని ప్రాసముగాని, రెండునుంగాని చెల్లును. ప్రథమ గణాద్యక్షరంబునకును దృతీయగణాద్యక్షరమునకును యతి.

చెప్పవలయు. అట్లే పంచమగణాద్యక్షరమునకును సప్తమ గణాద్యక్షరమునకును యతి సెప్పవలయు. ప్రాసమైనచోఁ బాదమున రెండవయక్షరమునకును, మూఁడవగణము రెండవ యక్షరమునకును ప్రాసముఁ జెప్పవలయు. ప్రతిపాదమునకును రెండేసి యతులు గలవు. మఱియు నిదేప్రకారంబుగా నైదవ గణంబు రెండవయక్షరమునకును, నేడవగణము రెండవయక్షర మునకును బ్రాసంబు సెప్పవలగును. ఈవివరణంబు నీలక్షణ పద్యమువలననే తెలియనగును. ముందు ద్విపద సీసములకు విశ్రాంతి (యతి) రెంటికైనను పద్యంబున యతి వివరింపఁ బడుచున్నది.

సీసమునకు ఉదాహరణముగా నొక్క పద్యపాదము నకు గణవిభజన చేయుచున్నాను.

| | | | | |
|---|---|---|---|---|
| 1 ఇం. గ.<br>భగణము<br>ఇంద్రగ | 3 ఇం. గ.<br>సలము<br>ణములాఋ | • | 3 ఇం. గ.<br>నగము<br>నినగణం | 4 ఇం. గ.<br>సలము<br>బులురెండు |
| 5 ఇం గ.<br>రగణము<br>పాదపా | 6 ఇం. గ.<br>నలము<br>దమునను | • | 1 సూ. గ.<br>నగణము<br>బరఁగు | 2 సూ. గ.<br>గలము<br>చుండు |

క్రింద గీతలుగల యక్షరములు యతిప్రాసస్థానములు

ఆటవెలఁది తేటగీతములకు ముందు లక్షణంబులు చెప్పఁ బడెను గాన నిచట వివరింపఁబడవయ్యె.

## ద్విపదలక్షణము.

క. ఎలమిన్ మూఁడింద్రగణం
బులపై నొకసూర్యగణముఁ ♦ బొందించిన న
ల్లలితముగ ద్విపదలక్షణ
మిలఁ బదములు రెండుప్రాస♦మేకము [కృష్ణా]26

తా. ద్విపదమున నొక్కొక్క పాదమునకు మొదట మూఁడింద్రగణములును, వాని వెనుక నొక్క సూర్యగణమును నుండవలయు. మొదటి గణముయొక్క మొదటి యక్షరమునకును మూఁడవగణముయొక్క మొదటి యక్షరమునకును యతి చెల్లును. మఱియు నిట్టి పాదములకు రెండు రెండింటికిం బ్రాసముం జెప్పవలయును. ద్విపదకుఁ బ్రాసయతి యుంచఁ దగదు.

ఒక్క ద్విపదకు గణవిభాగముచేసి దీనికుదాహరణము చూపెదను.

నడురాత్రి యరుదెంచె ♦ నరలోకనాథ
కడు డస్సినాఁడవు ♦ కనుమోడ్తుగాక. 27

| | | | | |
|---|---|---|---|---|
| 1. ఇంద్ర గ. | 2. ఇంద్ర గ. | | 3. ఇంద్ర గ. | 1. సూ గ. |
| సలము | సలము | | సలము | గలము |
| (1)నడురాత్రి | యరుదెంచె | ♦ | నరలోక | నాథ |
| సలము | భగణము | | సలము | గలము |
| (2) కడుడస్సి | నాఁడవు | ♦ | కనుమోడ్తు | గాక |

(1) పాదములో 'వ' 'న' లకును, (2) పాదములో 'క్ష' 'క్ష' లకును యతి చెల్లును. మొదటి పాదములోని 'దు' అను రెండవయక్షరమునకును, రెండవ పాదములోని 'దు' అను రెండవయక్షరమునకును ప్రాసము చెల్లెనని యెఱుఁగ వలయును.

సమవృత్తములకు లక్షణముం జెప్పుచున్నాఁడు.—

## ఉత్పలమాలావృత్తము.

[భానుసమాన] విన్భ,ర,న,
భా,ర,లగంబులఁ గూడివిశ్రమ
స్థానమునందుఁ బద్మజయు
తంబుగ నుత్పలమాలయై చనున్. 28

ఉత్పలమాలావృత్తమునకు

| | | | |
|---|---|---|---|
| భగణము | =U I I | భ ,, | =U I I |
| ర ,, | =U I U | ర ,, | =U I U |
| న ,, | =I I I | లగ ,, | =I U |
| ,, | =U I I | | |

అను నీగణంబులును, పదియవయక్షరము యతిగా నుండవలయు.

ఉదాహరణము.

| భ | ర | న | భ | భ | ర | లగ |
|---|---|---|---|---|---|---|
| భానుస | మానవి | న్భరన | భారల | గంబులఁ | గూడివి | శ్రమ |
| U I I | U I U | I I I | U I I | U I I | U I U | I U |

గీట్లుగీచిన 1-10 యవ యక్షరములకు యతి యని యెఱుంగుఁడు.

ప్రాసము ప్రతిపాదమునను రెండవయక్షరమునకుఁ జెల్లును. ఇట్లే సమవృత్తముల కన్నింటికి నని యెఱుఁగఁదగు.

చంపకమాలావృత్తలక్షణము.

న,జ,భ,జ,జ,జ్జ, రేఫలఁ బె
♦నంగి దిశాయతితోడఁ గూడినన్
[ద్రిజగదభీష్టదా! బుధని
♦ధీ] విను చంపకమాల యై చనున్. 29

చంపకమాలావృత్తము న, జ, భ, జ, జ, జ, ర యను గణంబులం గూడి పదునొకండవ యక్షరము యతిగాఁ గల్గి యుండవలయును.

ఉదాహరణము.

| | | | |
|---|---|---|---|
| న జ భ | । । । = న గణము | దిశాయ | = । ⌣ । = జ గణము |
| జ జ జ్జ | = । ⌣ । = జ ,, | తితోడఁ | = । ⌣ । = జ ,, |
| రేఫలఁ | = ⌣ । । = భ ,, | గూడినన్ | = ⌣ । ⌣ = ర ,, |
| బెనంగి | = । ⌣ । = జ ,, | | |

మొదటి గణముయొక్క మొదటి యక్షరమగు 'న' కారమునకును, బదునొకండవయక్షరమగు 'న' కారమునకును యతి చెల్లెనని యెఱుంగుఁడు.

ఇట్లే తక్కిన మూఁడు పాదములకు లక్షణముఁ దెలియవలయు.

## శార్దూలవిక్రీడితవృత్తలక్షణము

[సారాచారవిశారదా] యినయతి
న్శార్దూలవిక్రీడితా
కారం బై మ,స,జమ్ము లిమ్ముగ స, తా,
గ,ప్రాప్తమై చెల్వగున్. 30

తా. మ, స, జ, స, త, త, గ యను గణంబులు గల్గి పదుమూఁడవ యక్షరము యతిస్థానముగాఁ గలది శార్దూలవిక్రీడితవృత్తం బనఁబడును.

ఉదాహరణము.

| | | |
|---|---|---|
| సారాచా = U U U = మ గణము | | శార్దూల = U U I = త గణము |
| రవిశా = I I U = స ,, | | విక్రీడి = U U I = త ,, |
| రదాయి = I U I = జ ,, | | తా = U = గ ,, |
| నయతిన్ = I I U = స ,, | | |

'సా' యను మొదటియక్షరమునకు 'శా' యను పదుమూఁడవయక్షరమునకు యతి చెల్లును. ఇట్లే తక్కినమూఁడు పాదంబులకును లక్షణము.

## మత్తేభవిక్రీడితవృత్తలక్షణము.

[స్మయదూరా] విలసత్త్రయోదశయతి
న్మత్తేభవిక్రీడితా
హ్వాయమయ్యెన్ స, భ, ర, మ్ముల న్న, మ,య,వ
వ్రాతంబుల న్గూడఁ గాన్.

తా. మత్తేభవృత్తము స, భ, ర, న, మ, య, వ యను గణంబులంగల్గి, పదునాలవయక్షరము యతిగాఁ జెప్పినదిగా నుండవలయును.

ఉదాహరణము.

| | | | |
|---|---|---|---|
| స్మయదూ = I I U = సగణము | | తిన్మత్తే = U U U = మగణము | |
| రావిల = U I I = భ ,, | | భవికీ్రి = I U U = య ,, | |
| సత్త్రియో = U I U = ర ,, | | డితా = I U = వ ,, | |
| దళయ = I I I = న ,, | | | |

'స్మ' యనుదానిలోని 'మ' కారమునకును, 'న్మ' యనుదానిలోని 'మ' కారంబునకును యతి చెల్లును. ఇట్లే తక్కిన పాదంబు లూహ్యంబులు.

## మత్తకోకిలావృత్తలక్షణము. (కవిజనాశ్రయము)

[శ్రీవకాభరణాంక] విజ్ఞ ర, స,
జా, భ, రేఫల దిగ్విరా
మావహంబుగ మత్తకోకిల
యండ్రు దీనిఁ గవీశ్వరుల్. 32

తా. మత్తకోకిల వృత్తము ర, స, జ, జ, భ, ర యను గణంబులం గలిగి పదునొకండవయక్షరము యతిచే నొప్పియుండవలయు నని కవులు సెప్పుదురు.

ఉదాహరణము.

| | |
|---|---|
| శ్రావకా= U । U =రగణము | సజాభ = । U । = జ గణము |
| భరణాం= । । U= స ,, | రేఫల = U । । = భ ,, |
| కవిణ్ర= । U । = జ ,, | దిగ్విరా= U । U = ర ,, |

మొదటియక్షరమగు 'శ్రా' కును, 'జా' యను పదునొకండవయక్షరమునకు యతియగును. ఇట్లే తక్కినపాదము లూహ్యంబులు.

ధ్రువకోకిలావృత్తలక్షణము.

[శుభవిలాస! ముకుంద! కేశవ!]

శూలిభవ్యవిరామముర్
న, భ, ర, సంబులు జా,గ ముల్ దగు
నవ్యమై ధ్రువకోకిలన్. 33

తా. న, భ, ర, స, జ, జ, గ యనుగణంబులు గలిగి పండ్రెండవ యక్షరము యతిగాఁ గలిగినది ధ్రువకోకిలవృత్త మనఁబడును.

ఉదాహరణము.

| | |
|---|---|
| శుభవి = । । । = నగణము | లిభవ్య = । U । = జ గణము |
| లాసము= U । । = భ ,, | విరామ= । U । = జ ,, |
| కుందకే= U । U = ర ,, | ముర్ = U = గ ,, |
| శవశూ = । । U = స ,, | |

'శు' అను మొదటి యక్షరమునకును, 'శూ' యను పండ్రెండవయక్షరమునకును యతి చెలంగును. ఇట్లే తక్కినపాదములందు నని యెఱుంగవలయు.

## పృథ్వీవృత్తలక్షణము.

త్రయోదశయతిఀ గృతిఀ జ,స,జ,సల్, జతంబై యవల్ [దయాజలనిధీ] చెలంగువినుపృథ్వి ♦ ధాత్రిఀ దగన్. 34

తా. జ, స, జ, స, య, వ యను గణంబులతోఁ గూడి పదునాలవయక్షరము యతిగాఁ గలది పృథ్వీవృత్తమనఁబడును.

ఉదాహరణము.

| | |
|---|---|
| త్రయోద । ౧ । = జగణము | సజసల్ = ।। ౽ =స గణము |
| శయతిఀ ।। ౽ = స ,, | జతంబై = । ౽ ౽= య ,, |
| గృతిఀజ= । ౽ । =జ ,, | యవల్ = । ౽ =లగము |

'త్ర' యను మొదటి యక్షరమునకును బదునాలవ యక్షరమగు 'త' వర్ణమునకును యతి యొప్పెను. ఇట్లే తక్కిన పాదములకు నని యెఱుంగవలయు.

## సరసాంకవృత్తలక్షణము.

సరసాంకవృత్తే మమరు♦న్స,జ, సా,య లొందఁగ
సరసీజసంభవయతిఀ ♦ [జలజాతనేత్రా]. 35

తా. స, జ, స, స, య యను గణములతోఁ గూడి పదియవ యక్షరము యతిగాఁ గలది సరసాంకవృత్త మనఁబడును.

ఉదాహరణము.

| | |
|---|---|
| సరసాం = ।। ౽= స గణము | సజసా = ।। ౽ = సగణము |
| కవృత్తె = । ౽ । =జ ,, | యలొందఁగ= । ౽౽=య ,, |
| మమరుఀ= ।। ౽=స ,, | |

మొదటి 'స' కారమునకును, పదియవ యక్షరమగు సకార మునకును యతిచెల్లెను. ఇట్లే తక్కిన మూఁడు పాదములు నని రెఱుఁగవలయును.

## స్రగ్ధరావృత్తము.

[శ్రీమన్మూర్తి] మకారా• శ్రిత, ర, భ, న, య, య్యా,
• సేవ్యమై సానుమద్వి
శ్రామంబు న్సానుమద్వి• శ్రమము నమరఁగా
• స్రగ్ధరావృత్త మయ్యెన్. 36

తా. మ, ర, భ, న, య, య, య అను గణంబులు కల్గి ప్రతి యేడవయక్షరమునకు పిమ్మట యతి యుండవలయు; (అనఁగా పాదమునకు రెండేసి యతు లుండవలెను.)

### ఉదాహరణము.

| | |
|---|---|
| శ్రీమన్మూ = U U U = మ గణము | యయా నే = I U U = య గణము |
| ర్తిమకా = U I U = ర ,, | వ్యమైసా = I U U = ,, |
| రాశ్రిత = U I I = భ ,, | నుమద్వి(శ్రా) = I U U = ,, |
| రభన = I I I = న ,, | |

'శ్రీ' యను మొదటి యక్షరమునకు 'శ్రి' యను నెనిమిదవయక్షరము, 'సే' యను పదునైదవ యక్షరమును యతులైయొప్పియున్నవి. ఇట్లే తక్కినమూఁడుపాదము లూహ్యములు.

## మహాస్రగ్ధరావృత్తము.

[లసదుద్యత్కీర్తివల్లీ♦లలితగుణగణా
♦లంకృతాంగా] స,తా,న
స్థసరాగంబుల్ మహాస్ర♦గ్ధరకు వసుముని
♦స్థాగవిశ్రాంతి యొప్పున్. 37

తా. స, త, త, న, స, ర, ర, గ. యను గణంబులం గల్గి తొమ్మిదవయక్షరమును, పదునాఱవయక్షరమును యతి యై యొప్పినవృత్తము మహాస్రగ్ధరావృత్త మనఁబడును.

ఉదాహరణము.

| | | | |
|---|---|---|---|
| లసదు | =॥\|=స గణము | ణగణా | =॥\|=స గణము |
| ద్యత్కీర్తి | =\|\|॥=త ,, | లంకృతాం | =\|॥\|= ర ,, |
| వల్లీల | =\|\|॥=త ,, | గాసతా | = \|॥\|= ర ,, |
| లితగు | = ॥॥=న ,, | న | = \| = ,, |

మొదటిగణంబున మొదటి లకారమునకు మూఁడవగణము కడపటి 'ల' కారంబును, ఆఱవగణంబులోని 'ల' కారమును యతియందు సరిపోలి యున్నవి. తక్కినమూఁడు పాదముల కిట్లే లక్షణం బెఱుంగవలయును.

## స్రగ్విణీవృత్తలక్షణము.

[వాగ్వధూవల్లభా] ♦ వార్ధి రేఫావళుల్
స్రగ్విణీవృత్తవి♦శ్రాంతి యేడింటిపై. 38

తా. నాలుగురగణంబులు గలిగి యేడవయక్షరము యతిగాఁ గలది స్రగ్విణీవృత్త మనఁబడును.

ఉదాహరణము.

వాగ్వధూ = U | U = ర గణము
వల్లభా = U | U = ర ,,
వార్ధిరే = U | U = ర ,,
ఘావళుల్ = U | U = ర ,,

'వా' యను మొదటి యక్షరమునకును 'వా' యను మూఁడవ గణము మొదటి యక్షరమునకును యతి చెల్లెను. తక్కిన యవియు నిట్లే.

భుజంగప్రయాతవృత్తలక్షణము.

[జగద్గీతకీర్తీ] భుజంగప్రయాతం
బగుఁ [రేచనా] యద్వయద్వంద్వ మైనన్. 39

తా. య, య, య, య అను నాలుగుగణంబులు గల్గి యెనిమిదింట యతి గలది భుజంగప్రయాత మనఁబడును.

ఉదాహరణము.

| | |
|---|---|
| జగదీ = । UU = యగణము<br>తకీర్తీ = । UU = యగణము<br>భుజంగ = । UU = యగణము<br>ప్రయాతం = । UU = యగణము | మొదటిగణములోని 'జ' కారమునకును, మూఁడవ గణములోని 'జ' కారమునకును యతి. ఇట్లే తక్కినపాదములు లూహ్యములు. |

## పాదపవృత్తలక్షణము.

పాదపవృత్తము ♦ భా, భ, గ, గంబుల్
మోదముతో నిరు♦మూట విరామం. 40

తా. మూఁడుభగణంబులును రెండుగురువులుం గల్గి యేడింట యతి గలది పాదపవృత్త మనఁబడును.

### ఉదాహరణము.

| | |
|---|---|
| పాదప = ‿ । । = భ గణము<br>వృత్తము = ‿ । । = భ ,,<br>భాభగ = ‿ । । = భ ,,<br>గంబుల్ = ‿ ‿ = గ ,, | మొదటిగణములో 'పా'యను నక్షరమునకును మూఁడవగణములోని 'భా' యనునక్షరమునకును యతి యొప్పినది. |

## తోటకవృత్తలక్షణము.

తుదిదాఁక సకారచ♦తుష్కము గా
విదితంబుగఁ దోటక ♦ వృత్త నుగున్. 41

తా. తోటకవృత్తంబున నొక్కొక్కపాదంబునకు స, స, స, స అను నాలుగు సగణంబు లుండవలయు. తొమ్మిదింట యతి.

### ఉదాహరణము.

| | |
|---|---|
| తుదిదాఁ = । । ‿ = స గణము<br>కసకా = । । ‿ = స ,,<br>రచతు = । । ‿ = స ,,<br>ష్కముగా = । । ‿ = స ,, | మొదటి 'తు' వర్ణమునకును తొమ్మిదవ 'తు' వర్ణమునకును యతి యొప్పినది. తక్కిన మూఁడు పాదము లిట్లూహ్యంబులు. |

## తోదకవృత్తలక్షణము.

[జలరుహావక్త్ర] న, • జా, యగణంబుల్
వెలయఁగఁ దోదక•వృత్తమగున్. 42

తా. న, జ, జ, య అనుగణంబులంగలిగి యెనిమిదింట యతి గలది తోదకవృత్తమనఁబడును.

ఉదాహరణము.

| | |
|---|---|
| జలరు = ।।। = న గణము | మొదటి 'జ' కారమునకును |
| హావక్త్రి = ।ᑌ। = జ ,, | ఎనిమిదవ 'జ' కారమునకు |
| నజాయ = ।ᑌ। = జ ,, | ను యతి. ఇట్లితరపాదము |
| గణంబుల్ = ।ᑌᑌ = య ,, | లూహ్యములు. |

## మదనవృత్తలక్షణము.

[దైతేయభంజన హారి]•త్త, భ, జా, గగంబుల్
మాతంగవిశ్రమమున • న్మదనాఖ్య యొప్పున్.

తా. త, భ, జ, జ, గగ యను గణంబులు గల్గి తొమ్మిదింట యతి గలది మదనవృత్తమనఁబడును.

ఉదాహరణము.

| | |
|---|---|
| దైతేయ = ᑌᑌ। = త గణము | మొదటి 'దై' యను అక్షరము |
| భంజన = ᑌ।। = భ ,, | నకును, 'త' యను తొమ్మిదవ |
| హారిత్త = ।ᑌ। = జ ,, | యక్షరమునకును యతి పోలి |
| భజాగ = ।ᑌ। = జ ,, | యున్నది. తక్కినపాదములు |
| గంబుల్ = ᑌᑌ = గగము | నిట్లే. |

## పంచచామరవృత్తలక్షణము.

జ,ర,జ్జ,ర,జ్జ,గంబుఁ గూడి•సన్నుతిన్ రచింపఁగాఁ
[బరాజితారిధీరవీర] • పంచచామరంబగున్. 44

తా. జ, ర, జ, ర, జ, గ యనుగణంబులును, పదవయింట యతియుఁ గలది పంచచామరవృత్త మనఁబడును.

### ఉదాహరణము.

| | | | |
|---|---|---|---|
| జరజ్జ | =\|U\| | =జ | గణము |
| రజ్జగం | =U\|U | =ర | ,, |
| బుఁగాడి | =\|U\| | =జ | ,, |
| స్తన్నుశే | =U\|U | =ర | ,, |
| రచింపఁ | =\|U\| | =జ | ,, |
| గా | =U | =గ | ,, |

‘జ’ యను మొదటి యక్షరమునకు ‘స’ యను పదియవ యక్షరము యతి పోలి యున్నది. తక్కిన పాదంబు లిట్లే యూహ్యంబులు.

## సుగంధివృత్తలక్షణము.

ఏడు హాల్ములు గ్గము న్వడెన్మిది న్సుగంధికిన్. 45

తా. ఏడుహాగణములును, వాని ప్రక్క నొక్క గురువునుం గల్గి తొమ్మిదింట యతి గలది సుగంధివృత్త మనఁబడును.

### ఉదాహరణము.

| | | | | |
|---|---|---|---|---|
| ఏడు | =U\| | = | గలము | 1. |
| హాల్ము | =U\| | = | ,, | 2. |
| లుగ్న | =U\| | = | ,, | 3. |
| మున్వ | =U\| | = | ,, | 4. |
| డెన్మి | =U\| | = | ,, | 5. |
| దిన్సు | =U\| | = | ,, | 6. |
| గంధి | =U\| | = | ,, | 7. |
| కిన్ | =U | = | గ | |

మొదటి ఏకారమునకు ‘డెన్మిదిన్’ అనుపదములో ‘డె’యను నక్షరమందున్న ‘ఎ’ కారమునకును యతి చెల్లియున్నది. ఇట్లితరపాదము లూహ్యములు.

## ఉత్సాహవృత్తలక్షణము.

సాహచర్యపద్మమిత్ర♦స_ప్తకంబు గురువు ను
*త్సాహవృత్తమునకె చెల్లు♦[జలజదళవిలోచనా]

ఏడు సూర్యగణంబులు గల్గి, యయిదవగణము మొదటియక్షరము యతిగాఁ గలది యుత్సాహవృత్త మనఁబడును. (నగణము I I I, గలము U I — ఈ రెండును సూర్యగణంబులు గనుక, నీయుత్సాహవృత్తముయొక్క ఒక్కొక్క పాదములో నన్నియు నగణములైనను, లేక యన్నియు గలములుగానైనను, లేక నగణ, గలములు గలిసియైన నుండవచ్చును.

ఉదాహరణము.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| సాహ | = | U I | = | గలము | = సూర్యగణము | 1. |
| చర్య | = | U I | = | గలము | = ,, | 2. |
| పద్మ | = | U I | = | గలము | = ,, | 3. |
| మిత్ర | = | U I | = | గలము | = ,, | 4. |
| సప్త | = | U I | = | గలము | = ,, | 5. |
| కంబు | = | U I | = | గలము | = ,, | 6. |
| గురువు | = | I I I | = | నగణము | = ,, | 7. |
| ను[త్సా] | = | U | = | గ | = | |

'సా' యను మొదటిగణము మొదటియక్షరమునకు నైదవ గణము మొదటియక్షరమగు 'స' యనుదానికిని యతియొప్పును.

* త్సాహవృత్తపై ఖరిం బ్ర♦శ స్తమౌను బురహరా !. పై పాదంబునఁ గ్రమభంగ మాట నియ్యది చేర్పఁబడె.

## తరళవృత్తలక్షణము.

న,న,న,న,న,న,న,గపు లెలమి
♦ నళినహితవిరమణాతఁ
దనరి తరళ మనఁగ వెలయు
♦[ధరణి మదనమదహరా.] 47

తా. తరళవృత్తమున నొక్కొక్కపాదమున కేడునగణము లును వానిపై నొక్కగురువు నుండవలయును. పదుమూఁడవ యక్షరము యతిస్థానము.

### ఉదాహరణము.

| | |
|---|---|
| ధ ర ణి = ।।। = న గణము | |
| మ ద న = ।।। = ,, | |
| మద హ = ।।। = ,, | 'న' యను మొదటి యక్షరము |
| రా = ।।। = ,, | నకు పదుమూఁడవ యక్షరమగు |
| న్నళిన = ।।। = ,, | నకారము పోలియున్నది. ఇట్లు |
| హితవి = ।।। = ,, | తక్కిన పాదముల గణవిభజన |
| రమణ = ।।। = ,, | మూహ్యంబు. |
| తఁ = U=గ ,, | |

## రమణకవృత్తలక్షణము.

[మనసిజజనకస♦మదరిపుగజహారి]
♦మదగజవసువిరమణములతో
న,న,న,న,న,న,న,న,న♦న,లగము లెనయఁగ
♦[నరవరనుత]రమణక మమరుఁ. 48

తా. రమణకవృత్తమున నొక్కొక్కపాదమునకుఁ దొమ్మిది నగణములును దానిపై నొక్క లగమును నుండును. తొమ్మిదవ యక్షరమును బదునేడవయక్షరమును యతిస్థానము.

ఉదాహరణము.

| | | | | | |
|---|---|---|---|---|---|
| మనసి | = ❘ ❘ ❘ = | నగణము | రిమద | = ❘ ❘ ❘ = | నగణము |
| జజన | = ❘ ❘ ❘ = | ,, | గజవ | = ❘ ❘ ❘ = | ,, |
| కసమ | = ❘ ❘ ❘ = | ,, | సువిర | = ❘ ❘ ❘ = | ,, |
| చరిపు | = ❘ ❘ ❘ = | ,, | మణమ | = ❘ ❘ ❘ = | ,, |
| గజహ | = ❘ ❘ ❘ = | ,, | లతో | = ❘ ∪ = | ,, |

తా. ఇట మొదటి 'మ' యనువర్ణమునకును, దొమ్మిదవ యక్షరమగు 'మ' వర్ణమునకును బదునేడవయక్షర మగు 'మ' వర్ణమునకును యతి యొప్పును. ఇట్లు తక్కినమూఁడు పాదములూ నూహ్యములు.

## మాలినీవృత్తలక్షణము.

న,న,మ,య,య,యుతంబై
 నాగవిశ్రాంత మై యి
[ట్లనుపమగుణ] మాలి
 న్యాహ్వయం బయ్యె భాత్రిన్. 49

తా. న, న, మ, య, య, అను గణంబులతోఁ గూడి తొమ్మిదింట యతి గలది మాలినీవృత్త మనఁబడును.

ఉదాహరణము.

| | |
|---|---|
| నన మ = ।।। = నగణము | మొదటి గణము లోని 'న' వర్ణమునకును, తొమ్మిదవ యక్షరమగు 'నా' కును యతి చెప్పియున్నది. ఇట్లితర పాదములు తెలియఁదగు. |
| యయయయు = ।।। = ,, | |
| తంబైనా = ᑌᑌᑌ=మ ,, | |
| గవిశ్రాం = । ᑌᑌ=య ,, | |
| తమైయి(ట్ల)=। ᑌᑌ= య,, | |

## మానినీవృత్తలక్షణము.

కారములు న్క్రియఁ ♦ గన్గొన నేడు భ
♦కారము లొక్కగ♦కారముతో
గారవన్మై చనఁ ♦ గావళు లన్నియుఁ
♦గల్గిన మానిని ♦ [కానునిభా]. 50

తా. మానినీవృత్తమున నొక్కొక్కపాదమున నేడు భగణములును వానిపై నొక్కగురువును నుండవలయు. ఏడేసియక్షరముల కొక్కొక్క యతియుండును. (అనఁగా ౭, ౧౩, ౧౯-వ యక్షరములలో యతి మైత్రి).

ఉదాహరణము.

| | | | |
|---|---|---|---|
| కారము | = ᑌ ।। = భ గణము | | 1. |
| లున్క్రియ | = ᑌ ।। = భ | ,, | 2. |
| గన్గొన | = ᑌ ।। = భ | ,, | 3. |
| నేడుభ | = ᑌ ।। = భ | ,, | 4. |
| కారము | = ᑌ ।। = భ | ,, | 5. |

| | | | |
|---|---|---|---|
| లోక్క-గ | = U \|\| = భ గణము | | 6. |
| కారము | = U \|\| = భ | ,, | 7. |
| తో | = U = గ | ,, | |

## కవిరాజవిరాజితవృత్తలక్షణము.

క్రమమున నొక్క న-కారము నాఱు జ
కారములుం బరఁగంగ వకా
రమును నొడంబడిరాఁగ విరాజవి
రాజిత మన్నది [రామనిభా] 51

తా. కవిరాజవిరాజితవృత్తమున నొక్కొక్క పాదమున న, జ, జ, జ, జ, జ, జ, వ యను గణములుండవలెను. ఎనిమిదింటఁ బదునాలుగింట యతు లుండవలయును.

### ఉదాహరణము.

| | | | |
|---|---|---|---|
| క్రమము | = \| \| \| = న గణము | జకార | = \| U \| = జగణము |
| నన్నొక్క | = \| U \| = జ ,, | ములంబ | = \| U \| = జ ,, |
| నకార | = \| U \| = జ ,, | రఁగంగ | = \| U \| = జ ,, |
| ముణాఱు | = \| U \| = జ ,, | వకా | = U \| = లగము |

'క్ర' యనుచో నున్న కవర్ణమునకు, ఎన్మిదవ 'కా' యను వర్ణమును, బదునాలవ 'కా' యను వర్ణమును యతులగును.

## తరలివృత్తము.

చారు భ,స,న,భూరి జ,న,ర,♦సాంద్ర గణములన్ దిగా
పారవిరతి నందముగ ని♦జంబు తరలి చెన్నగుఁ.

తా. తరలివృత్తమున నొక్కొక్కపాదమునను భ,స,న, జ, న, ర యనుగణంబులును, పదునొకండవయక్షరము యతియును నుండవలయును.

ఉదాహరణము.

| | | | | |
|---|---|---|---|---|
| చారుభ = U I I = భ | గణము | రసాంద్ర = I U I = జ | ,, |
| సనభూ = I I U = స | ,, | గణము = I I I = న | ,, |
| రిజన = I I I = న | ,, | లన్దిగా = U I U = ర | ,, |

మొదటిగణములోని 'చా' యనునక్షరమునకును, 'సా' యను పదునొకండవయక్షరమునకును యతి.

## మలయజవృత్తము.

[నళినవిలోచన] ♦ న, జ, న, స, నంబులు
♦ న, భ, న, గణంబులు ♦ నట లగమున్
మలసి గిరిత్రయ♦మహితయతుల్ దగి
♦మలయజవృత్తము♦మహి వెలయుఁ. 53

తా. మలయజవృత్తమున నొక్కొక్కపాదమునకును న, జ, న, స, న, న, భ, న, లగము లుండవలయు. ప్రతియెనిమిదవ యింటను (అనఁగా ౯, ౧౭, ౨౫ వ యక్షరములలోను) యతిస్థాన మగు నని యెఱుంగుఁడు.

ఉదాహరణము.

| | | | | | |
|---|---|---|---|---|---|
| నళిన | = I I I = న గణము | భవగ | = I I I = న గణము |
| విలోచ | = I U I = జ ,, | ణంబులు | = U I I = భ ,, |
| ననజ | = I I I = న ,, | శటల | = I I I = న ,, |
| నసనం | = I I U = స ,, | గముల్ | = I U = ల గము |
| బులున | = I I I = న ,, | | |

'న' యను ప్రథమగణాద్యక్షరమునకును యేనిమిదవ పదునైదవ యిరువదిరెండవ 'న' యను నక్షరములకును యతి.

## సాధ్వీవృత్తము.

[నారదసనకస♦నందనవినుతస
♦ నాథ] భ,న,జ,న,స♦నా,భగురుల్
చారుశిఖరియతి♦శైలవిరమణము
♦ శ్లాఘరవిరతిని ♦ సాధ్వియగుల్. 54

తా. భ, న, జ, న, స, న, న, భ, గ యను గణంబులం గల్గి పదియెన్మిదవయింటను యతి గలది సాధ్వీవృత్త మనఁబడును.

ఉదాహరణము.

| | | | |
|---|---|---|---|
| నారద | = U I I = భ గణము | భభన | = I I I = న గణము |
| సనక | = I I I = న ,, | జనస | = I I I = న ,, |
| సనంద | = I U I = జ ,, | నాభగు | = U I I = భ ,, |
| నవిను | = I I I = న ,, | రుల్ | = U = గ ,, |
| తసనా | = I I U = స ,, | | |

ఈపద్యంబున 'నా' యను మొదటియక్షరమునకు, ఎనిమిదవదగు 'నం' పదునైదవదగు 'నా' ఇరువదిరెండవదగు 'న్నా' అను నక్షరములు మూఁడును యతులై యున్నవి.

## లాక్షణీవృత్తలక్షణము.

పక్షవిరమణము భ, న, న, న, న, ములును
♦ భాసుర భ, న, న, స లెనసినచో
లాక్షణి యనఁ దగు [నతులితసుదనవి
♦ లాసలలితగుణగణజలధీ]. 55

తా. భ, న, న, న, న, భ, న, న, స అనుగణములును, పదునైదింటయతియుఁ గలిగినది లాక్షణీవృత్త మనఁబడును.

ఉదాహరణము.

| | | | | |
|---|---|---|---|---|
| పక్షవి | = U I I | = భ | గణము | 1. |
| రమణ | = I I I | = న | ,, | 2. |
| ముభన | = I I I | = న | ,, | 3. |
| ననన | = I I I | = న | ,, | 4. |
| ములును | = I I I | = న | ,, | 5. |
| భాసుర | = U I I | = భ | ,, | 6. |
| భనన | = I I I | = న | ,, | 7. |
| సలెన | = I I I | = న | ,, | 8. |
| సినచో | = I I U | = స | ,, | 9. |

మొదటి 'ప' యను నక్షరమునకు పదునాఱవదియగు 'భా' యను నక్షరమునకును యతి.

శిఖరిణీవృత్తము.

[పురారాతిస్పర్ధి] య,మ,న,స,భ,వం
బు ల్వెనఁగి నుం
దరంబై నర్ [రేచా] శిఖరిణి యగుఁ
ద్వాదశయతిఁ. 56

తా. శిఖరిణీవృత్తంబున నొక్కొక్క పాదంబునకును య, మ, న, స, భ, వ, యను గణంబు లుండును. పదుమూఁడవ యింట యతి.

ఉదాహరణము.

| | |
|---|---|
| పురారా = ।ఽఽ = య గణము | సభనం = ।।ఽ = స గణము |
| తిస్పర్ధి = ఽఽఽ = మ ,, | బుల్వెనఁ = ఽ।। = భ ,, |
| యమన = ।।। = న ,, | గిసుం = ।ఽ = లగము |

ప్రథమగణాద్యక్షరమగు 'పు' వర్ణమునకును 'బు' అను పదుమూఁడవయక్షరమునకును యతి యొప్పియున్నది.

ప్రభువృత్తము.

ప్రముదితగజబుతు రహివిశ్రమముల్
రమణఁ గవివర్యనుతంబును నై
క్రమమున న,న,నలు రహి నైదు జకా
రములును గలమున్ బ్రభువృత్త మగున్.

తా. ప్రభువృత్తమునకు మూఁడునగణములును, వానివెంబడి నైదుజగణములును వానివెంబడి నొకనగణమును నుండవలయును. తొమ్మిదియవ, పదునైదవవర్ణములు యతిస్థానములు.

ఉదాహరణము.

| | |
|---|---|
| ప్రముది = ।।। = నగణము 1. | మణన్గ = । U । = జ గణము 3 |
| తగజ = ।।। = న ,, 2. | విపర్య = । U । = జ ,, 4 |
| ఋతుర్ = ।।। = న ,, 3. | నుతంబు = । U । = జ ,, 5 |
| హావిశ్ర = । U । = జ ,, 1. | నునై = । U । = నగణము (లగణము) |
| మముల్గ = । U । = జ ,, 2. | |

ప్రథమగణము మొదటి 'ప్ర' యను నక్షరములోని రేఫమునకును, తొమ్మిదవ, పదునైదవ యక్షరము లగు రేఫములకు యతిమైత్రి.

## ఇంద్రవజ్రావృత్తము.

ఇత్తా, జ, గా, సంగతి నింద్రవజ్రా
వృత్తం బగుఁ [సన్నుత వృత్త రేచా]. 58

తా. ఇంద్రవజ్రావృత్తమునకొక్కొక్కపాదమునకును త, త, జ, గగ అనుగణంబు లుండవలయును. ఎనిమిదవయక్షరము యతిస్థానము.

ఉదాహరణము.

| | |
|---|---|
| ఇత్తాజ = U U । = తగణము | మొదటి 'ఇ' కారమునకును, ఎనిమిదవ యక్షర మగు 'ని' అను దానిలోని ఇకారమునకును యతి. |
| గాసంగ = U U । = త ,, | |
| తినింద్ర = । U । = జ ,, | |
| వజ్రా = U U = గగము | |

### ఉపేంద్రవజ్రావృత్తము.

సపద్మపద్మాజిత♦జల్ గగంబున్
ఉపేంద్రవజ్రాఖ్యము♦నొప్పుఁ జెప్పన్.

తా. జ, త, జ, గగ యనుగణంబులును, ఎనిమిదవయక్షరము యతిగాఁగలది యుపేంద్రవజ్రావృత్తి మనఁబడును.

ఉదాహరణము.

| | |
|---|---|
| సపద్మ = । ∪ । జ గణము<br>పద్మాజ = ∪ ∪ । త ,,<br>తజల్ గ = । ∪ । జ ,,<br>గంబున్ = ∪ ∪ గగము. | ప్రథమగణాద్యక్షరంబగు 'స' వర్ణమునకును ఎనిమిదవవర్ణమగు 'జ' వర్ణమునకును యతి. |

### ఉపజాతివృత్తలక్షణము.

ఈరెండువృత్తంబులు ♦ నిందుఁ గూడన్
[సరోజనేత్రా] యుప♦జాతి యయ్యెన్. 60

తా. ఒకపాదమున నింద్రవజ్రావృత్తలక్షణమును. మఱియొక్కపాదమున నుపేంద్రవజ్రావృత్తలక్షణమునునున్నయెడల నయ్యది యుపజాతివృత్తి మనఁబడును. అనఁగా నుపజాతివృత్తమున మొదటిపాదమునకు త, త, జ, గగ అనుగణంబులును, రెండవపాదమున జ, త, జ, గగ అనుగణంబులును నుండవలెను.

ఉదాహరణము.

మొదటిపాదము.

ఈరెండు = ∪ ∪ । త గణము
వృత్తంబు = ∪ ∪ । త ,,

లుతిందుఁ = | ᑌ | = జ గణము
గూడన్ = ᑌ ᑌ = గగము

రెండవపాదము.

సరోజ = | ᑌ | = జ గణము
నేత్రాయు = ᑌ ᑌ | = త ,,
పజాతి = | ᑌ | = జ ,,
యయ్యెన్ = ᑌ ᑌ = గగము

మొదటిపాదమున 'ఈ' కారమునకును, ఎనిమిదవ యక్షరమగు 'ని' లోని ఇకారమునకు యతి. రెండవపాదమున 'స' వర్ణమునకును, ఎనిమిదవ యక్షరమైన 'జా' యనువర్ణమునకును యతి.

## మందాక్రాంతావృత్తలక్షణము.

[కాంతాకాంతా] మభ, న,త,త,గా
క్రాంతసంక్రాంతమందా
క్రాంతం బయ్యెఁ విరమదశ యా
క్రాంతివిశ్రాంత మైనన్. 61

తా. మ, భ, న, త, త, గగ యనుగణంబులు గలిగి పదుకొండవ యక్షరము యతిగాఁ గలది మందాక్రాంతావృత్త మనఁబడును.

ఉదాహరణము.

కాంతాకాం = ᑌ ᑌ ᑌ = మ గణము
తామభ = ᑌ | | = భ ,,
నతత = | | | = న ,,

గాక్రాంత =ᑌᑌ। = త గణము
సంక్రాంత =ᑌᑌ। = త ,,
మందా =ᑌᑌ = గగము

మొదటి 'కా' కును పదునొకండవ 'కా' కును యతి. ఇట్లు తక్కినమూఁడుపాదములుఁ దెలియనగు.

## రథోద్ధతవృత్తలక్షణము.

[నందితప్రియ] ర•నంబుపై రవం
బొంది వచ్చిన ర•థోద్ధతం బగుఁజ. 62

తా. ర, న, ర, వ యనుగణంబులును, ఏడింట యతియుఁ గలది. రథోద్ధత మనఁబడును.

### ఉదాహరణము.

| | |
|---|---|
| నందిత = ᑌ।ᑌ = రగణము | నంబుపై= ᑌ।ᑌ=ర గణము |
| ప్రియర= ।।। = న ,, | రవం = ।ᑌ= లగము |

'న' యను మొదటియక్షరమునకును, ఏడవ 'న' వర్ణమునకును యతి.

## స్వాగతవృత్త లక్షణము.

స్వాగతంబగు [ల•సద్గుణలక్ష్మీ
భాగ్యభోగ ] ర, న,•భల్ గగయుక్తిఁజ. 63

తా. స్వాగతవృత్తంబున నొకొక్కపాదమునకు ర, న, భ, గగయనుగణంబు లుండవలయు. ఏడింట యతి.

ఉదాహరణము.

| | |
|---|---|
| స్వాగతం = ᑌ । ᑌ = ర గణము | సన్మణ = ᑌ ।। = భ గణము |
| బగుల = ।।। = న ,, | లక్ష్మీ = ᑌ ᑌ = గగము |

'స్వా' యను మొదటివర్ణమునకును, 'స' యను నేడవవర్ణమునకును యతి యొప్పును. ఇట్లితర పాదము లెఱుఁగుఁడు.

## వంశస్థవృత్తలక్షణము

[సముజ్జ్వలాంగా] జ, త్, జంబు రేఫతో
నమర్ప వంశస్థసమాహ్వయం బగుఁ. 64

తా. జ, త, జ, ర యనుగణంబులం గూడి, యెనిమిదవ యక్షరము యతిగాఁ గలది వంశస్థవృత్త మనఁబడును.

ఉదాహరణము.

| | |
|---|---|
| సముజ్జ్వ = । ᑌ । = జగణము | మొదటి 'స' వర్ణమునకును, ఎనిమిదవ 'జ' యను వర్ణమునకును యతి. |
| లాంగాజ = ᑌᑌ। = త ,, | |
| తజంబు = । ᑌ । = జ ,, | |
| రేఫతో = ᑌ । ᑌ = ర ,, | |

## ఇంద్రవంశవృత్తలక్షణము.

[నన్మానధారీ] త, త్, జంబు రేఫతో
విన్నింద్రవంశాహ్వయవృత్త మయ్యెఁ. 65

తా. త, త, జ, ర యను గణంబులతోఁ గూడి, ఎనిమిదింట యతి గలది యింద్రవంశవృత్తమనఁబడును.

ఉదాహరణము.

సన్తాన=UU। = త గణము తజంబు= ।U। = జ గణము.
ధారీల=UU। = త ,, రేఫతో=U।U = ర ,,

మొదటి 'స' వర్ణమునకును, ఎనిమిదవ 'జ' వర్ణంబునకును యతి.

మేఘవిస్ఫూర్జితవృత్తలక్షణము.

రమానాథు న్నాథుఁ యదుకులశిరో
• రమ్యరత్నాయమానుఁ
సముద్యత్తేజిష్ణుఁ దనుజయువతి
• స్ఫారధైర్యాపహారుఁ
మిముం బ్రీతిఁ బేర్కొం ద్రుణవిరతిఁ
• మేఘవిస్ఫూర్జితాఖ్యఁ
గ్రమం బొప్పఁ బెద్దల్ యు, మ, న, స, ములుఁ
• రాగములాముు [కుందా]. 66

తా. య, మ, న, స, ర, ర, గ అనుగణంబులు గలిగి, పదుమూఁడింట యతిగలది మేఘవిస్ఫూర్జితవృత్తమనఁబడును.

ఉదాహరణము.

రమానా =।UU = య గణము
థున్నాథుఁ=UUU = మ ,,
యదుకు =।।। = న ,,
లశిరో =।।U = స ,,

| | | |
|---|---|---|
| రమ్యర | = ౮ । ౮ = | రగణము |
| త్నాయమా | = ౮ । ౮ = | ర ,, |
| నుణ్ | = ౮ | = గ ,, |

మొదటి 'ర' వర్ణంబునకును, పదుమూఁడవ 'ర' వర్ణమున కును యతి.

## భద్రకవృత్తలక్షణము.

[విద్రుమాభ] ర,సంబు వణ భద్రకంబు ధరిత్రిపై.

తా. భద్రకవృత్తమునకు ర, స, వ గణము లుండవలయు. యతిలేదు.

### ఉదాహరణము.

| | | | |
|---|---|---|---|
| విద్రుమా = ౮ । ౮ = ర గణము | బునణ్ = । ౮ వగణము |
| భరసం = । । ౮ = స ,, | |

## మణిరంగవృత్తము.

శ్రీరసద్వయ • సేవ్యగకారా

ధార మైనది • దా మణిరంగం. 68

తా. మణిరంగవృత్తమున నొక్కొక పాదమునను, ర, స, స, గ యనుగణము లుండవలయు. ఆఱింట యతి.

### ఉదాహరణము.

| | |
|---|---|
| శ్రీరస = ౮ । ౮ = ర గణము | మొదటి 'శ్రీ' యనుసంయు |
| ద్వయసే = । । ౧ = స ,, | క్తాక్షరములోని శవర్ణమునకు |
| వ్యగకా = । । ౮ = స ,, | ఆఱవయది యగు 'సే' వర్ణము |
| రా = ౮ = గ ,, | నకును యతి. |

## వనమయూరవృత్తలక్షణము.

ఉన్నతములై వనమ•యూరకృతు లొలిఁ
ఎన్నఁగ భ,జంబులప•యిఁ న, న, గగంబుల్
చెన్నొదవ దంతి యతి•చెంది యలరారఁ
[వెన్నుని నుతింతురు వి•వేకు లతిభక్తిఁ.] 69

తా. భ, జ, స, న, గగ యనుగణంబులు గల్గి తొమ్మిదింట యతితోఁ గూడినది వనమయూరవృత్తము.

ఉదాహరణము.

| | |
|---|---|
| ఉన్నత = U I I = భ గణము | రకృతు = I I I = న గణము |
| ములైవ = I U I = జ ,, | లొలిఁ = U U = గగము |
| నమయూ = I I U = స ,, | |

మొదటి 'ఉ' కారమునకును తొమ్మిదవ 'యూ' కారమునకును యతి.

## వసంతతిలకావృత్తలక్షణము.

సారంబుగాఁ ద,భ,జ,•జంబు [వసంతరాజా
కారా] వసంతతిల•కం బగు గాయుతంబై. 70

తా. వసంతతిలకావృత్తమున నొక్కొకపాదమునకును త, భ, జ, జ, గగ అనుగణంబులును, ఎనిమిదింట యతియు నుండవలయును.

ఉదాహరణము.

| | |
|---|---|
| సారంబు = ∪ ∪ ∣ = త గణము | వసంత = ∣ ∪ ∣ = జగణము |
| శాంద్రభ = ∪ ∣ ∣ = భ ,, | జారా = ∪∪ = గగము |
| జజంబు = ∣ ∪ ∣ = జ ,, | |

మొదటి 'సా' కును, ఎనిమిదవ 'జా' కును యతి.

## విద్యున్మాలావృత్తలక్షణము.

ఉద్యన్మాగా♦యుక్తం బైనన్
విద్యున్మాలా♦వృత్తం బయ్యెన్. 71

తా. విద్యున్మాలావృత్తంబునకు నొక్కొక్క పాదంబునను మ, మ, గగ అనుగణంబులును, ఐదింట యతియు నుండ వలయును.

ఉదాహరణము.

| | |
|---|---|
| విద్యున్మా = ∪ ∪ ∪ = మ గణము | రెండవపాదమున మొదటి |
| లావృత్తం= ∪ ∪ ∪ = ,, | 'వి' కిని ఐదవ 'వృ' అను |
| బయ్యెన్ = ∪ ∪ = గగము | దానికిని యతి. |

## తోటకవృత్తము.

శ్రియుతభత్రయ♦సేవ్యగగంబుల్
[తోయజలోచన]♦తోటకమయ్యెన్. 71

తా. భ, భ, భ, గగ అనుగణంబులతోఁ గూడి యేడింట యతి గలది తోటకవృత్త మనఁబడును.

ఉదాహరణము.

| | |
|---|---|
| శ్రీయుత = U \| \| = భ గణము | సైన్యగ = U \| \| = భగణము |
| భత్రయ = U \| \| = భ ,, | గంబుల్ = UU = గగము |

మొదటి 'శ్రీ' కారమునకును, ఏడవ 'సే' యనునక్షరమునకును యతి.

## ద్రుతవిలంబితవృత్తలక్షణము.

ద్రుతవిలంబితదుష్కరవృత్తమ
ప్రతిమ మయ్యె నభా, ర, గణంబులన్. 73

తా. న, భ, భ, ర యనుగణంబులును, ఏడింట యతియుఁ గలది ద్రుతవిలంబితవృత్త మనఁబడును.

ఉదాహరణము.

| | |
|---|---|
| ద్రుతవి = \| \| \| = న గణము | దుష్కర = U \| \| = భగణము |
| లంబిత = U\| \| = భ ,, | వృత్తమ(ప్ర) U \|U = ర ,, |

'ద్రు' యను మొదటియక్షరమునకును 'దు' అను నేడవ యక్షరమునకును యతి చెల్లి యున్నది.

## తరళవృత్తము.

ప్రవరరుద్రవిరామయుక్తిన
భంబులున్ ర, స, జా, గముల్
[గవిజనాశ్రయ]పొంది యందము
గా ధరన్ దరళం బగున్. 74

తా. తరళవృత్తమున నొక్కొక్కపాదమునకు, న, భ, ర, స, జ, జ, గ యనుగణములును, పండ్రెండవయక్షరము యతిగాను నుండవలయును.

ఉదాహరణము.

| | | | |
|---|---|---|---|
| ప్రిపర = \| \| \| = న గణము | | బులఁజా | ర = \| U \| = జ గణము |
| రుద్రవి = U \| \| = భ ,, | | సజాగ | = \| U \| = జ ,, |
| రామయు = U \| U = ర ,, | | ముల్ | = U = గ ,, |
| క్తినభం = \| \| U = స ,, | | | |

'ప్ర' యను మొదటియక్షరమునకు 'భ' యను పండ్రెండవ యక్షరమునకును యతి.

చంద్రకళావృత్తలక్షణము.

[శ్రావకాభరణాంక] దిశావి
 శ్రామముతోడ ర,సా,స,త,ముల్
జా, విలగ్న గకారయుతంబై
 చంద్రకళాహ్వయమై చనుఁ. 75

తా. ర, స, స, త, జ, జ, గ అనుగణంబులతోఁ గూడి పదునొక్కండవయక్షరము యతిగాఁ గలది చంద్రకళావృత్త మనఁబడును.

ఉదాహరణము.

| | |
|---|---|
| శ్రావకా = U \| U = ర గణము | ముతోడ = \| U \| = జ గణము |
| భరణాం = \| \| U = స ,, | రసాత = \| U \| = జ ,, |
| కదిశా = \| \| U = స ,, | ముల్ = U = గ ,, |
| విశ్రామ = U U \| = త ,, | |

'శ్రా' యను మొదటియక్షరమునకు 'శ్రా' యను పదునొకండవ యక్షరమునకును యతి చెల్లియున్నది. ఇట్లుతక్కిన మూఁడుపాదము లూహ్యములు.

అంబురుహావృత్తము.

[శ్రీరమణీప్రియ మల్లయ రేచ వి
శిష్టకల్పమహీజ] భా,
భా, ర, స, వంబుల భానువిరామము
వల్క నంబురుహం బగుఁ. 76

తా. భ, భ, భ, భ, ర, స, వ యనుగణంబులం గూడి, పదుమూఁడింట యతిగలది యంబురుహావృత్త మనఁబడును.

ఉదాహరణము.

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| శ్రీరమ | = ∪ । । | భ | గణము | శిష్టక | = ∪ । ∪ | = ర | గణము |
| ణీప్రియ | = ∪ । । | భ | ,, | ల్పమహీ | = । । ∪ | = స | ,, |
| మల్లయ | = ∪ । । | భ | ,, | జభా | = । ∪ | = వ | ,, |
| రేచవి | = ∪ । । | భ | ,, | | | | |

మొదటి 'శ్రీ' కిని పదుమూఁడవయక్షరమగు 'శి' కిని యతి.

క్రౌంచపదవృత్తలక్షణము.

[పంచశరాభా యంచిత ఫుణ్యా]
భ, మ, స, భ, న, న, న, య పరివృతమైనన్
క్రౌంచపదాఖ్యం బంచిత మయ్యెన్
గిరిమయతి దశవసుకలితగతుఁ గాఁగన్. 77

తా. భ, మ, స, భ, న, న, న, య యనుగణంబులతోఁ గూడి పదునొకండవయక్షరముమీఁదను, అదిమొదలు తొమ్మిదవయక్షరముమీఁదను యతి గలది క్రౌంచపదవృత్తమనఁబడును.

ఉదాహరణము.

| | | | | | |
|---|---|---|---|---|---|
| పంచశ | = U ।। = భ గణము | సభన | =।।। =నగణము | 1 |
| రాభాయం | = U U U = మ ,, | ననయ | =।।। =న ,, | 2 |
| చితపు | = ।। U = స ,, | ప్రరిత్యృ | =।।। =న ,, | 3 |
| ణ్యాభ్రమ | = U ।। = భ ,, | త్మైనన్ | =।UU =య ,, | |

'ప' యను మొదటియక్షరమునకు 'భ' యనుపదునొకండవయక్షరమును 'ప' యను నిరువదియవయక్షరమును యతులై యున్నవి. తక్కినపాదము లిట్లూహ్యములు.

సుంగళమహాశ్రీవృత్తము.

[శ్రీమహితలోకహిత ♦ శిష్టజనసేవితవి
♦ శేషగుణ]మంగళమహాశ్రీ
నామ మగు సద్భ,జ,స♦నంబులకడన్ భ,జ,స
♦నంబులు గగంబులఁ జెలంగన్. 78

తా. భ, జ, స, న, భ, జ, స, న, గగ అనుగణంబులం గూడి తొమ్మిదవది, దానికి తొమ్మిదవదియు నగునక్షరము యతి గాఁగలది మంగళమహాశ్రీవృత్తమనఁబడును.

ఉదాహరణము.

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| శ్రీమహి | = U I I | = భ | గణము | విశ్వేశ | = I U I | = జ | గణము |
| తలోక | = I U I | = జ | ,, | గుణమం | = I I U | = స | ,, |
| హితశ్రి | = I I U | = స | ,, | గళమ | = I I I | = న | ,, |
| ప్రజన | = I I I | = న | ,, | హశ్రీ | = U U | = గగము | |
| సేవిత | = U I I | = భ | ,, | | | | |

'శ్రీ' యను మొదటియక్షరమునకును 'శి' యనుతొమ్మిదవ యక్షరమునకును 'శ్వే' యను పదునేడవయక్షరమునకును యతి యొప్పియున్నది.

మధ్యాక్కర.

సురరాజయుగముతోఁ గూడి
♦సూర్యుతో నొడఁబడి యుండి
సురరాజయుగముతోఁ గూడి
♦సూర్యుతో నొడఁబడి వెండి
కర మొప్పు నీపాట నాఱు
♦గణములు మధ్యాక్కరంబు
విరచింపఁ బ్రావళ్లు నిట్లు
♦వెలయుఁ గవిజనాశ్రయుండ. 79

తా. మధ్యాక్కర యనువృత్తంబున నొక్కొక్కపాదము నను మొదటరెండింద్రగణములు, వానిపిదప నొకసూర్యగణము, మరల వాని పిదప రెండింద్రగణములు నొక్కసూర్యగణము నుండవలయును. నాలవగణముయొక్క మొదటియక్షరము యతిస్థానము.

ఉదాహరణము.

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఇం॥ గ॥ | ఇం॥ గ॥ | సూ॥ గ॥ | ఇం॥ గ॥ | ఇం॥ గ॥ | సూ॥ గ॥ |
| నలము | నగము | గలము | రగణము | నలము | గలము |
| సురరాజ | యుగముతో | గూడి | సూర్యుతో | నొదఁబడి | యుండి |

ఇందు మొదటి 'సు' అనువర్ణముతో నాలుగవగణములోని 'సూ' యనువర్ణము యతియందు పోలియున్నది. ఇట్లే తక్కిన పాదము లెఱుంగవలయును.

తరువోజలక్షణము.

1. ఇల నింద్రగణములు ♦ నినునితోఁ గూడ
నాలుగు గాఁ జేసి ♦ నయముతో డుతను
2. గలయంగ నెనిమిది♦గణములు రెండు
గణములఁ దుదఁ గూడఁ♦గా యతి రెండు
3. వెలయంగఁ బాదము ♦ ల్విరచించి యిట్లు
వేర్వేఱ నిప్పాట ♦ విదితమై యుండ
4. సలలిత పదగతిఁ♦జన జెప్పఁ డనియె
జానుగాఁ గవిజనా♦శ్రయుఁడు దరోవ్వజ. 80

తా. తరువోజవృత్తంబున నొక్కొక్క పాదంబునకును మొదట మూఁడింద్రగణములు, వానివెంబడి నొకసూర్యగణమును, మరలనట్లే మూఁడింద్రగణములు నొకసూర్యగణంబును జెప్పవలయును. అనఁగా నిట్లొక్కొక్కపాదమునను నెనిమిదిగణము లుండవలయును. రెండుగణములకు పిమ్మట మూఁడవ

గణంబు మొదటివర్ణమును వళ్లె యైదవగణమున నాద్యక్షర మున కేడవగణముయొక్క మొదటివర్ణంబును యతిస్థానంబులు.

ఉదాహరణము.

మొదటిపాదమునకు గణవిభజన

| 1 | 2 | 3 | 4 |
|---|---|---|---|
| ఇంద్రగణము | ఇంద్రగణము | ఇంద్రగణము | సూర్యగణము |
| సలము | నలము | నగము | గలము |
| ఇలనింద్ర | గణములు | నినునితోఁ | గూడ |
| **5** | **6** | **7** | **8** |
| ఇంద్రగణము | ఇంద్రగణము | ఇంద్రగణము | సూర్యగణము |
| భగణము | భగణము | నగము | నగణము |
| నాలుగు | గాఁజేసి | నయముతో | డుతను |

'ఇ' కారమునకు 'ని' యనునక్షరమందలి 'ఇ' కారమునకును, 'నా' యనువర్ణంబునకు 'న' వర్ణంబునకును యతి చెప్పియున్నది. ఇట్లు తక్కిన పాదము లెఱుంగవలయును.

## ద్విపదలక్షణము.

ఇంద్రగణములు మూఁడినగణం బొకటి
[చంద్రాస్య] ద్విపదకుఁ జనుఁ జెప్ప (రేచ.)

తా. ద్విపదకు నొక్కొక్క పాదమునకు మూఁ డింద్రగణములును, నొకసూర్యగణమును నుండవలయును. పాదపాదమునకును మూఁడవగణము మొదటియక్షరము యతిస్థానము. ద్విప

దకుఁ దక్కినవృత్తములకువలె నాలుగు పాదములు లేవు. రెండుపాదములే కాన, రెండేసి పాదముల కొక్క ప్రాసము చెప్పవలయును.

| | | | |
|---|---|---|---|
| ఇంద్రగణము | ఇంద్రగణము | ఇంద్రగణము | సూర్యగణము |
| భగణము | నగము | నగము | నగణము |
| ఇంద్రగ | ణములుమూఁ | డినగణం | బొకటి |
| ఇంద్రగణము | ఇంద్రగణము | ఇంద్రగణము | సూర్యగణము |
| తగణము | నలము | సలము | గలము |
| చంద్రాస్య | ద్విపదకుఁ | జనుఁ జెప్ప | రేచ |

ఉదాహరణము.

మొదటిఇకారమునకును మూఁడవగణము మొదటియికార మునకును యతి. రెండవపాదమున చకార, జకారములకుయతి.

దండకలక్షణము.

అమరంగ నసహాంబులం దాదిగా నొండొ, గా దేని, యాదిఁ దకారంబుగా నొండె, లోనందకా రమ్ము లిమ్మై గకారావసానంబుగాఁ జెప్పినన్ దండ కం బండ్రు దీనిం గవీంద్రుల్.

తా. దండకమునకు న, స, హ, య, త యనుగణంబుల లో నేదియైన నొకటి మొదట నిల్పి, యాగణములే వలసినట్లు ప్రాసాంత్యనియమములతో యతి నియమము వలసినట్లు చెప్ప వలయును.

### ఉదాహరణము.

| | |
|---|---|
| అమరం = ।। U=స గణము | కారమ్ము = UU ।=త గణము |
| గనస = ।।।=న ,, | లిమ్మైగ = UU ।=త ,, |
| హంబు = U ।=గలము(హ) | కారావ = UU ।=త ,, |
| అందాది = UU ।=త గణము | సానంబు = UU ।=త ,, |
| గానొండె = UU ।=త ,, | గాఁజెప్పి = UU ।=త ,, |
| కాదేని = UU ।=త ,, | వర్ణదండ = UU ।=త ,, |
| యాదిక్త = UU ।=త ,, | కంబండుఋ = UU ।=త ,, |
| కారంబు = UU ।=త ,, | దీనింగ = UU ।=త ,, |
| గానొండె = UU ।=త ,, | వీఁదుఋల్ = UU =గగము |
| లానంద = UU ।=త ,, | |

## లయగ్రాహివృత్తలక్షణము.

ఇం బలరఁగా భ,జ,స,నంబులతుదన్ భ,జ,స,
నంబులు భకారము నొనంబడ లయగ్రా
హిం బరగఁ జెప్పఁ గలనంబడినయట్లు యగ
ణంబు కృతిమీఁద నమరున్(బరహితార్థీ). 83

తా. లయగ్రాహివృత్తమున కొక్కొక్క పాదమునను భ, జ, స, న, భ, జ, స, న, భ, య యనుగణంబు లుండవలయు. పాదపాదమునను తొమ్మిదవ యక్షరము, దానికిఁ దొమ్మిదవ యక్షరము, దానికిఁ దొమ్మిదవదియు నిట్లు మూఁడు ప్రాసయతులు గలవు.

ఉదాహరణము.

| | |
|---|---|
| ఇంబల = U I I = భ గణము | సనంబు = I U I = జ గణము |
| రఁగాభ = I U I = జ ,, | లుభకా = I I U = స ,, |
| జసనం = I I U = స ,, | రమునొ = I I I = న ,, |
| బులతు = I I I = న ,, | డంబడ = U I I = భ ,, |
| దన్భజ = U I I = భ ,, | లయగ్రా = I U U = యగణము |

క్రింద గీఁతలు గీచిన 'ఇ' 'నం' 'నం' అను మూఁడక్షరములకును ప్రాసయతి చెప్పఁబడియె. ప్రాసయతి యిట్టిదని ముందు వివరింపఁబడును గాన నిందు వివరింపఁ బడదయ్యె. తక్కిన పాదము లిట్టూహ్యములు.

## లయవిభాతిలక్షణము.

న,స,న,న,స,నంబులును ♦ న,స,న,న,స,గంబులును
♦కొనఁగి కృతిపాదములు ♦ రసికముగఁ జెప్పన్
(గుసుమవరసాయకవ♦దసదృశగుణాభినుత
♦రస)లయవిభాతి యవి♦రస మనుకవీంద్రుల్. 48

తా. లయవిభాతివృత్తంబునకు న, స, న, న, స నగణములును మరల నట్లే న, స, న, న, సగ, అనుగణంబులును, పదియవ యక్షరముమీఁదఁ బ్రాసయతియు నుండవలయును.

| | | | | | |
|---|---|---|---|---|---|
| నసన | = III = న | గణము | నొసఁగి | = III = న | గణము |
| నసనం | = IIU = స | ,, | కృతిపొం | = IIU = స | ,, |
| బులును | = III = న | ,, | దముల | = III = న | ,, |
| నసన | = III = న | ,, | రసిక | = III = న | ,, |
| నసగం | = IIU = స | ,, | ముగఁజెప్పఁ | = III = 'సగణ' | |
| బులును | = III = న | ,, | | | యనుగణము |

మొదటి 'న' వర్ణమునకును పదియవ 'న' వర్ణమునకును బ్రాసయతి.

లయగ్రాహిలయవిభాతులకు యతినిర్ణయమును జెప్పుచున్నాఁడు.

తే. తొమ్మిదింటను దొమ్మిది తొమ్మిదింట
ధృతిలయగ్రాహికిని బ్రాస యతులు సెల్లుఁ
బదిటఁ బదిటను బదిటను బ్రాసయతులు
తగ లయవిభాతికిని జెల్లు (దానవారి). 85

తా. లయగ్రాహికిఁ దొమ్మిదవ యక్షరము మీఁదను, మరల దానికిఁదొమ్మిదవయక్షరము మీఁదను, మఱియు దానికిఁ దొమ్మిదవయక్షరము మీఁదను బ్రాసయతి చెల్లును. అట్లే లయవిభాతికిఁ బదియవయక్షరముమీఁదను, దానికిఁ బదియవయక్షరముమీదను మరల దానికిఁ బదియవయక్షరముమీఁదను ప్రాసయతి చెల్లును.

"అనన్తరాక్షరః ప్రాసః" అని యథర్వణాచార్యులవారు చెప్పినచొప్పున నియమిత మయిన యతి వర్ణమునకు రెండవ వర్ణము ప్రాస మని తెలియవలయును. లయగ్రాహికిఁ దొమ్మిదవయక్షరము యతి గనుక పదియవయక్షరము ప్రాసము. లయవిభాతికిఁ బదియవయక్షరము యతి గనుకఁ బదునొకొండవయక్షరము ప్రాసమగును. గానఁ బ్రాసలక్షణంబులం దెలిసి ప్రయోగింపవలయును.

ఇరువదియాఱుఛందంబులును వానియందుఁ బుట్టిన వృత్తంబులును జెప్పుచున్నాఁడు.

క. సమవృత్తములఁ జతుష్పా
దములం దొక్కొక్కయక్షరము మొదలుగాఁ బెరుగన్
గ్రమమున గణాక్షరంబులు
సమమగు నటె యిరువదాఱుఛందంబులకున్.

తా. ఛందంబు లిరువదియాఱు గలవు. ఒక్కొక్కఛందంబున ననేకసమవృత్తంబులు పుట్టుచున్నవి. అట్టిసమవృత్తమున నొకపాదమున కెన్నియక్షరములు గలవో, అయ్యది యన్నవఛందంబునఁ బుట్టినవి యని యెఱుఁగవలయును.

ఇరువదియాఱు ఛందస్సులేవి యనఁగా.

| | | | |
|---|---|---|---|
| 1. ఉక్త | 8. అనుష్టుప్పు | 15. అతిశక్వరి | 22. ఆకృతి |
| 2. అత్యుక్త | 9. బృహతి | 16. అష్టి | 23. వికృతి |
| 3. మధ్య | 10. పంక్తి | 17. అత్యష్టి | 24. సుకృతి |
| 4. ప్రతిష్ఠ | 11. త్రిష్టుప్పు | 18. ధృతి | 25. అతికృతి |
| 5. సుప్రతిష్ఠ | 12. జగతి | 19. అతిధృతి | 26. ఉత్కృతి |
| 6. గాయత్రి | 13. అతిజగతి | 20. కృతి | |
| 7. ఉష్ణిక్కు | 14 శక్వరి | 21. ప్రకృతి | |

| ఛందస్సంఖ్య | ఛందస్సుల పేళ్లు. | ఒకొక్కపాదమున కెన్ని యక్షరములు. | వానియందుఁ బుట్టిన వృత్త సంఖ్య. |
|---|---|---|---|
| 1. | ఉక్త | 1. | 2 |
| 2. | అత్యుక్త | 2. | 4 |
| 3. | మధ్య | 3. | 8 |
| 4. | ప్రతిష్ఠ | 4. | 18 |
| 5. | సుప్రతిష్ఠ | 5. | 32 |
| 6. | గాయత్రి | 6. | 64 |
| 7. | ఉష్ణిక్కు | 7. | 128 |
| 8. | అనుష్టుప్పు | 8. | 256 |
| 9. | బృహతి | 9. | 512 |
| 10. | పంక్తి | 10. | 1024 |
| 11. | త్రిష్టుప్పు | 11. | 2048 |
| 12. | జగతి | 12. | 4096 |

| సంఖ్య | ఛందస్సు పేళ్లు. | ఒక్కొక్క పాదమున కెన్ని యక్షరములు. | వానియందుం బుట్టిన వృత్తసంఖ్య. |
|---|---|---|---|
| 13. | అతిజగతి | 13 | 8192 |
| 14. | శక్వరి | 14 | 16384 |
| 15. | అతిశక్వరి | 15 | 32768 |
| 16. | అష్టి | 16 | 65536 |
| 17. | అత్యష్టి | 17 | 131072 |
| 18. | ధృతి | 18 | 262144 |
| 19. | అతిధృతి | 19 | 524288 |
| 20. | కృతి | 20 | 1048578 |
| 21. | ప్రకృతి | 21 | 2097152 |
| 22. | ఆకృతి | 22 | 4194304 |
| 23. | వికృతి | 23 | 8388608 |
| 24. | సుకృతి | 24 | 16777216 |
| 25. | అతికృతి | 25 | 33554432 |
| 26. | ఉత్కృతి | 26 | 67108864 |

ఈప్రకారము మున్ను చెప్పినవృత్తములలో నొక్కొక్క వృత్తమున కొక్కొక్క పాదమున కెన్నియక్షరము లేర్పడి యున్నవో, యా వృత్త మన్నన ఛందంబునం బుట్టినట్లు తెలియంగవలయు.

ఉదాహరణము.

1. ఉత్పలమాలావృత్తమునకు భ, ర, న, భ, భ, ర, వ—
2. చంపకమాలావృత్తమునకు న, జ, భ, జ, జ, జ,ర —వీని

లో మొదటిదానికి ఒక్కొక్కపాదమునకు(6 × 3=18 × 2) =20 యక్షరములు. రెండవ వానికి ఒక్కొక్క పాదమునకు (7 × 3)=21 అక్షరములు. కావున ఉత్పలమాలావృత్తముకృతి యనునిరువదియక్షఛందంబునను, చంపకమాలావృత్తము ప్రకృతియను నిరుపదియొక్క ఛందంబునను బుట్టినవని యెఱుంగవలయును. ప్రస్తారంబు వేసినయెడల .నాఛందంబులో నది యెన్నవవృత్తమైనది తెలియవచ్చును.

వ. కందగీతపద్యము లనేకవిధంబులఁ జెప్పినాఁడు గాని వానివలనఁ బ్రయోజనం బంతగా లేనందున వానిని వ్రాయ లేదు. సీసపద్యమునకు నాలుగైదు లక్షణంబులను జెప్పెను గాని యీగ్రంథమునఁ బ్రయోగంబు చూపనందున వ్రాయలేదు.

గణములమీఁది విశ్రమంబుఁ జెప్పుచున్నాఁడు.

ఆ. ద్విపద సీసములకు • విశ్రాంతి రెంటిపై
నెలమి గీత కందముఁలకు మూఁటి
కడల యతులు నాల్గు•గణములమీఁద ను
త్సాహమునకు విరతి• [సారసాక్ష]. 87

తా. ద్విపద సీసపద్యములకు మూఁడవగణము మొదటివర్ణమును, గీతకందములకు నాలవగణము మొదటియక్షరమును, ఉత్సాహవృత్తమున కైదవగణము మొదటియక్షరమును యతిస్థానంబు లని యెఱుంగుఁడు.

## యతివిషయము.

### యతుల పర్యాయపదంబులు.

క. విశ్రాంతి విగతి విశ్రమ
విశ్రామ విరామ విరమ విరమణము లనఁగ
విశ్రుత మగు యతి కృతి నధి
కశ్రావ్యంబై పెడంగుఁ గా నిడవలయున్. 88

**విశ్రాంతి, విరతి, విశ్రమము, విశ్రామము, విరామము, విరమము, విరమణము—ఈ 7 ను యతికిఁ బే.**

## యతిస్థానములందలి యక్షరముల మైత్రి.

సీ. తొకును కఖగఘల్ చఛజఝల్ శషసలు,
నయహాల కెల్లఁ గియ్యలు ఘటించుఁ
గీర్తింపఁ గ్రారయు గిలకయు రేఫకు,
నావడి సెల్లును నణల కెల్ల
మావడి సెల్లును మాకును బౌలకుఁ,
దావడి సెల్లును తథదధలకుఁ
బోలింప పుఫుబుభుల్ మూలకు విలసిల్లు,
లావడి సెల్లును రళల కెల్లఁ
తే. దలఁపఁ దలకట్ల కైత్వ వౌత్వమును దీర్ఘ
మిత్వ మేత్వంబు వట్రువ లేక సరణిఁ
గొమ్మునకుఁ జెల్లు నోత్వంబు లిమ్ము గాను
యతుల కివి లక్షణములు [పద్మాయతాక్ష].

| యత్యక్షరములు. | | వేనికి మిత్రములు. |
|---|---|---|
| 1. ...క ఖ గ ఘ ..చ ఛ జ ఝ ...శ ష స | ... ... | క్ష |
| 2. ... ళ | ... ... | అ, య, హ |
| 3. ... ు, ృ | ... ... | ర, |
| 4. ... ౖ | ... ... | న, ణ |
| 5. ... ౼ | .. ... | మ, ప, ఫ, బ, భ |
| 6. ... ౼ | ... ... | త, థ, ద, ధ |
| 7. ... పు, ఫు, బు, భు, | ... | ము |
| 8. ... ౚ | ... ... | ర, ళ |
| 9. ... ఆ, ఐ, ఔ, | ... | అ |
| 10. ... ఎ, ఏ, ఋ, ౠ, | ... | ఇ |
| 11. ... ఒ, ఓ, ఊ | ... | ఉ. |

మఱియు నింక నచ్చులలో నొండొంటికి విశ్రమంబుచెల్లు నచ్చులను వివరించుచున్నాఁడు.—

ఆ. అ ఆ ఐ ఔ లకు మఱి
ఇ ఈ లు ఋకారసహిత ♦ మె ఏ లకు నౌ
ఉ ఊ ల్దమలో నొడఁబడి
ఒ ఓ లకు వళ్లగు [న్న♦యోన్నతచరిత్రా].

తా. మఱియుఁ గొన్నియచ్చులకు యతిమైత్రి యిందుఁ జెప్పఁబడుచున్నది.

1. అ, ఆ, ఐ, ఔ—వీనిలో నొకదానికొక్కటి యతిచెల్లును
2. ఇ, ఈ, ఋ, ఎ, ఏ—వీనిలో నొకదానికొక్కటిని మైత్రి యగును
3. ఉ, ఊ, ఒ, ఓ—వీనిలో నొకదానితో నొక్కటియతియగును.

యతిభేదంబు లెఱింగించుచున్నాఁడు.

(లక్షణ చూడామణి).

సీ. సరసంపుయతియును ♦ సంయుక్తయతి వర్గ,
గరిమ దేశీయ మొ ♦ క్కటియుఁ బోల్కి
చక్కటియతి యను ♦ స్వరయతి స్వరయతి,
యావడి ఋవ్వడి ♦ మావడియును
ప్రభు విభాగంబు సౌ ♦ భాగ్యంబు ప్రాసంబు,
భిన్నంబు ప్రాది య ♦ భిన్నవిరతి
వెలయు నభేద్యంబు ♦ వృద్ధి నిత్యసమాస,
ప్లుతయతు లాదేశ ♦ యతి వికల్ప
తే. కాకువులు రివ్వడియును న ♦ ఖండవిరతి
యుభయయతి యశవర్గాదు ♦ లొనవు మెరసి
కృతుల ముప్పదియొక్కటి ♦ యతులు దనరు
సత్కవులసమ్మతంబున ♦ [జలధిశయన].

యతులు ముప్పదియొకటి. అవి యెవ్వి యనఁగా—

| | |
|---|---|
| 1. సరసయతి | 18. ప్రాదియతి |
| 2. సంయుక్తయతి | 19. అభిన్నయతి |
| 3. వర్గయతి | 20. అభేద్యయతి |
| 4. దేశీయయతి | 21. వృద్ధియతి |
| 5. ఎక్కటియతి | 22. నిత్యసమాసయతి |
| 6. పోలికయతి | 23. ప్లుతయతి |
| 7. చక్కటియతి | 24. ఆదేశయతి |
| 8. అనుస్వారయతి | 25. వికల్పయతి |
| 9. స్వరయతి | 26 కాకుయతి |
| 10. యావడి | 27. రివ్వడి |
| 11. ఋవ్వడి | 28. అఖండయతి |
| 12. మావడి | 29. ఉభయయతి |
| 13. ప్రభుయతి | 30. య వర్గ—31. శవర్గ ద్వయ యతులు. ఇంకను పరరూప యతి, ఆావడి మొదలగునవి గలవు. |
| 14. విభాగయతి | |
| 15. సౌభాగ్యయతి | |
| 16. ప్రాసయతి | |
| 17. భిన్నయతి | |

ఈ ముప్పదియొక్క, యతులకు లక్షణంబులను, నుదాహరణములను వరుసగాఁ జెప్పుచున్నాడు.—

## 1. సరసయతులు:—

(అనంతునిఛందమునందు)

ఆ. నణలు చెల్లుఁ గమల•నాభ! యొండొంటికి
నయమహ లొనరఁ జెల్లు • హస్తివరద

శషస లొందు నం[ద్రు] ♦ చఛజఝుంబులతోడ
సరసయతులు నాఁగ ♦ [జలధిశయన].

1. న, ణ—ఇవి యొండొంటికి మిత్త్రము లగును.

2. అఁ య, హ—వీనికి పరస్పరము యతి చెల్లును.

3. శ, ష, స, చ, ఛ, జ, ఝ—వీనిలో నొక్కదాని కొక్కటి విశ్రమ మగును.

1. దీనికిఁ బైపద్యంబున నే యుదాహరణంబుఁ జూపెదను.

2. రెండవపాదమున 'అ' కారమునకును, 'హ' కారమున కును యతి.

3. మూఁడవపాదమున 'శ' 'చ' లకును, నాలవపాదమున, 'స' 'జ' లకును యతిమైత్త్రి చెప్పఁబడియె.

4. మొదటిపాదంబున 'ణ' 'నా' లకు యతిమైత్త్రి చెప్పఁ బడెను.

## 2. సంయుక్తయతి:—

క. ఒక్కపదంబున విశ్రాంతులు
పెక్కగు సంయుక్తమునకుఁ ♦ బెనుపుగమునుజ
ద్దక్కరములఁ దా నెత్తిన
యక్కరమె యొనర్పవలయు ♦ నన్నిటఁ గృష్ణా!.

తా. ఒక్కపాదమున రెండు, మూఁడు, నాలుగుయతులు గలవృత్తములు చెప్పునపుడు, ఏపాదమందైనను సంయుక్తాక్షర

ముండు నేని, యా పాదమునందుఁ దక్కిన వియు నట్టే యుండ నగును.

సంయుక్తయతికి సామాన్యముగ లక్షణముఁ జెప్పు చున్నాఁడు.—

క. వెలయఁగ సంయుక్తాక్షర
ములలో నెద్దానినైన ♦ మునుకొని వడిగా
నిలుపం దగుఁ బాదంబుల
[నలఘుగుణాన్వితుఁడ ! రేచ♦యసదృశదానా].

తా. పాదముల మొదట నైనను, యతిస్థానమునం దైనను, సంయుక్తాక్షరములు గలవేని, వానిలో నొకయక్షరము నెత్తి కొని యతి చెప్పవచ్చును.

ఒక్క పాదంబున రెండు, మూఁడు, నాలుగుయ తులు గలవేని, యాపాదము మొదటి యక్షరమును బట్టి యతిస్థానమందలి యక్షరము సంయుక్తాక్షరం బయ్యెనేని, యాపాదమునందుఁ దనకు గుదిరినవర్ణ మెద్దియో దానికే కూర్చుకొని యారెండు మూఁడు యతిస్థానములలో నిలుపవలె నని చెప్పఁబడెను.

వీని కుదాహరణము నిచ్చుచున్నాఁడను:—

మహాస్రగ్ధరావృత్తము. (తారాశశాంకవిజయము).

(ఆ. 4-పద్య. 153.)

అని దిగ్వేదండశుండా♦యతవృషులభుజో
♦దగ్రదంభోళికేళ

గాని గోదోనుండలిక మిణ్గురులు గుములు గా
♦ గుప్ప సారించి యుద్య
ఘ్నశక్తిం ద్రిప్పఁ గొండల్ ♦ గడగడ వణఁకం
♦ గల్పవిశ్రాంతివేళా
జనితామర్షో గ్రకాల ♦ స్మరహరుక్రియః నా
♦ స్థాని ది గ్గంచు లేవక.

దీనికి ముందు చెప్పినట్లు తొమ్మిదవ,పదునాలవయక్షరములు యతులు.

1. ఈ యుదాహరణంబున రెండవపాదము మొదట 'గొ' యని యుండుటచే 'ణ్గు' అని యతిస్థానంబున నున్న 'గ' కార మె గ్రహింపఁబడెను.

2. ఇట్లు మూఁడవపాదము మొదట 'ఘ్న' యని యున్న, దానినుండి, ఘకారముగానే గ్రహించి, దానికి మిత్త్రములగు 'గ' కారములె తక్కినయతిస్థానంబులందు నిల్పఁబడెను.

3. నాలుగవపాదము మొదట 'జ' యుండుటచేఁ దక్కిన యతిస్థానములలో రెంటిలోను 'స్మ' 'స్థా' యని యున్నను, జకారమునకు మిత్రమయిన 'స' కారమునే గ్రహించి యతి సమకూర్పఁబడెను.

ఇట్లే రెండు మూఁడుయతు లుండుకవిరాజవిరాజితాది వృత్తములం దెలుఁగవలయును.

3. వర్గయతి:—

క. నిక్కువ మెయ్యెది వర్గుల
యక్కర మగువల్లనడుపఁనగు జ ఞ ణ న మల్
దక్కఁ బెఁ నాలుగింటఁ
[దిక్కరి సన్నిభుఁడ రేచ ధీజనవినుతా].

తా. వరము లైదుగదా.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | క | ఖ | గ | ఘ | ఙ |
| 2 | చ | ఛ | జ | ఝ | ఞ |
| 3 | ట | ఠ | డ | ఢ | ణ |
| 4 | త | థ | ద | ధ | న |
| 5 | ప | ఫ | బ | భ | మ |

ఈయైదు వర్గంబులలో నొక్కొక్కవర్గములోఁ గడపటి యక్కరములు దక్కఁ దక్కినవి తమలోఁ దాము మిత్రములై యతియం దొప్పును. కఖగఘ—ఇవి యొక్కటితో నొక్కటి యతిమైత్రి గలవి. ఇట్లు చ ఛ జ ఝ లును ; ట, ఠ, డ, ఢ, లును ; త, థ, ద, ధ లును; ప, ఫ, బ, భ లును అయ్యాయి వర్గంబులలో నొండొంటికి మిత్రములై యొప్పుయతి వర్గయతి యనఁబడును.

దీని కుదాహరణము—ఈ పద్యము నాలవపాదమున 'ది' 'ధీ' యని ద, ధ లకు యతి చెప్పఁబడియె. ఇదియె వర్గయతి యనఁబడును.

జ్ఞావడి (అనంతుని ఛందంబునందు)

తే. అప్రసిద్ధము జ ఞ లు శబ్దాదులందు
ఞ జల సంయుక్తిఁ దద్భవవ్యాజమునను
న ణలతో నొందు విరతి విజ్ఞప్తి యనఁగ
జలరుహాతపో శ్రితులును సుజ్ఞాను లనఁగ.

తా. కవర్గ పంచమాక్షరమైనఙకారమును, చవర్గ పంచమాక్షరం బయిన ఞకారంబును నొకపదముయొక్క మొదట లేవు. జకారముక్రింద ఞావత్తుచేర్చిన సంస్కృతపదమునం దున్న జ్ఞకారమునకు తద్భవమునందు 'న' 'ణ' కారములు వచ్చును. అట్టి 'న'కార'ణ'కారములకును 'జ్ఞ'కారమునకును యతి చెల్లునని యెఱుంగవలయు.

న ణలతో ననుచోట 'న' కారంబునకును విజ్ఞప్తి యనుచో 'జ్ఞ' కారమునకును యతి చెల్లెను. తద్భవపదములఁ జెప్పుచున్నాఁడు.

ఆ. యజ్ఞమునకు జన్న ♦ మాజ్ఞప్తి కానతి
మాజ్ఞ కాన సంజ్ఞ ♦ కరయ సన్న
విన్నపంబు నగును ♦ విజ్ఞాపనమునకు
జ్ఞాకుఁ దద్భవంబు ♦ నా ధరిత్రి.

| ప్రకృతి | తద్భవము | ప్రకృతి. | తద్భవము |
| --- | --- | --- | --- |
| యజ్ఞము | జన్నము | ఆజ్ఞ | ఆన |
| ఆజ్ఞప్తి | ఆనతి | సంజ్ఞ | సన్న |
| | | విజ్ఞాపనము | విన్నపము |

ఇట్లు పైసంస్కృతపదములోని 'జ్ఞ' కారమునకు బదులు 'న'కారము వచ్చినది.

పైపద్యము నాలవపాదమున 'జ్ఞా' కు 'నా' కును యతిచెప్పఁబడియె.

దీనికి నైషధమునం దుదాహరణము.

ఉత్పలమాల. శ్రీలలనాతనూభవవి
శేషజగన్మయమూల మన్మథా
జ్ఞాలతికాలవాల రతి
నాథమరాళమదాంధశుం——

... ... ... ...

ఈపద్యమున రెండవపాదంబున 'జ్ఞా' కును 'నా' కును యతి చెప్పఁబడియె.

4. దేశీయయతి:—(చిత్రకవి పెద్దరాజు).

తే. అచ్చుతోఁ గూడి దేశీయ మనెడివిరతి
యెన్న నొక్కొక్కచోటఁ గ్రిక్కిఱియుయతుల
సరసలక్షణకవులు గ్రచ్చఱ నొనర్ప
[భంజితాసురసముదాయ యాంజనేయ].

తా. పాదాదియందుఁ బ్రత్యేకముగాఁ బ్రయోగింపఁబడిన యచ్చునకు యతిస్థానంబున హల్లుమీఁద నున్న స్వర మూఁదక పోయినను, దానికి మిత్రం బగుస్వరమైనచో యతి సెల్లును.

ఈపద్యమున రెండవపాదంబునఁ బ్రత్యేకముగాఁ బ్రయోగింపఁబడి, ఎన్నన్, అనుచోఁ బదాదినున్న 'ఎ' కారమునకు, "క్రిక్కిఱియుఁ" అనుపదమునందు రెండవవర్ణమైన 'క' కారము మీఁద నున్నయికార మూదఁబడక శబ్దస్వభావమైనదైనను. ఇ, ఏ, ఋ మొదలగునవి యతు లగు నని ముందు చెప్పియుండుటచే యతి చెల్లిన దని యెఱుంగవలయు.

5. ఎక్కటియతి;—

క. ధర నెక్కటివళ్లనఁ దగు
ల ర మ అ వ లు వానితోఁ దొలంగక లాకున్
సరి శా యని విశ్రమవే
శ రమాధిప రెండునుం గలసి వర్తించున్.

తా. ల, ర, మ, అ, వ యనునక్షరములు పాదాదియందును యతిస్థానంబునందును 'అ' కారముతోఁ గూడెనేని యాయతి యెక్కటియని చెప్పఁబడును. లకార శకారములు రెండును విశ్రమంబుఁ బొందును. మఱియు ల, శ, ష నభేదయతియుం జెప్పవచ్చును గాన నీయతిస్వరూపంబు పెద్దవాలుగ నాలోచింపవలయు నని తోఁచుచున్నది.

దీని కుదాహరణము.

ఆ. మరునితండ్రి లోకమహితుండు యాదవ
రాజసింహమూర్తి రక్షకుండు
అాచవేలు పనఁగ రంజిల్లు నెక్కటి
వళ్లు నాఁగ నిల్లు [వనజనాభ.]

పైపద్యమునందు మొదటిపాదమున 'మ' కారమునకును, రెండవపాదంబున రేఫము (ర) నకును, మూఁడవపాదమున 'అ' కారమునకును, నాలుగవపాదమున 'వ' కారమునకును యతి చెప్పఁబడినది.

ల శ లకు పైలక్షణపద్యమందు నాలుగవ గీటున

'శ్రీరమాధిప రెండునుం గల్పి వర్తించుక' అనుచో యతి తెలియుచున్నది. ఈ యతియొక్క భేదము దెలియుట కష్టమని తోఁచుచున్నది.

6 పోలికయతి:—(ముకారయతి.)
(అనంతుని ఛందంబున.)

క. పోలున్ పు ఫు బు భులకు మతి
పోలిక యతి శీల ముల్లమున కెన యనఁగా
శీలం బుల్లం బనఁగా
భూలోకం బమరలోకమున కెన యనఁగన్.

తా. పు, ఫు, బు, భు, అనువర్ణములకును 'ము' వర్ణమునకును యతి చెల్లుట పోలికయతి యనఁబడును. దీనికే ముకార యతి యని మఱియొక పేరు గలదు.

పై పద్యమున రెండవపాదంబున 'పో' 'ము' లకును నాలుగవ పాదమున 'భూ' 'ము' లకును యతి చెప్పఁబడెను.

ఉదాహరణము:— (ఉద్యోగపర్వమునుండి)

క. చనునీవు హాస్తినాపుర
మున కేనును బాండుభూపపుత్త్రులఁ బ్రీతిన్
గని యిటువత్తు నవశ్యం
బును వారలఁ జూడవలయుఁ బ్రోయెద ననినన్.

పై పద్యంబున రెండవపాదమున 'ము' వర్ణమునకు 'పు' వర్ణమునకు యతి చెప్పఁబడియె. నాలవపాదంబున 'బు' 'ప్రో' లకును యతి చెప్పఁబడియె.

7. చక్కటియతి:—(అనంతుని ఛందంబునందు)

క. అక్కజముగ పు ఫు బు భు లకుఁ
జక్కటియతి యియ్యు శృంగసహిత మకారం
బక్కమలజేశ్వరాదుల
[మొక్కులు గైకొను సమస్తభువనాధీశా].

తా. ఈ పద్యము నాలవపాదమున మొక్కులు అనుచో, 'మ' అనునక్షరముమీఁదనున్న ఉకారమునకు 'భువనా' యను పదములోని 'భు' అనునక్షరము మీఁదనున్న ఉకారమునకును విశ్రమంబు చెల్లునుగాన మకారభకారములు మైత్రి నిబొందినవి; కాని తక్కిన నాలుగువర్గములలోని పంచమాక్షరములు తమ వర్గములలోని యితరాక్షరములతో మైత్రి నొందవు పోలికయతికిని చక్కటియతికిని భేదము గనుపింపలేదు గావున నవిరెండు నొక్కటియని కొందఱు వ్రాసియున్నారు.

దీనికి నుదాహరణము (పంచబాణవిలాసము.)

క. చిత్తమ్మున రంజిల్లుచు
ముత్తెదువ లపుడు గదిసి పూవిల్తునకున్
బిత్తరికి బలు తెఱంగుల
నెత్తిరి హారతులు పౌరు లెల్లఁ జెలంగన్.

పై పద్యమున రెండవపాదంబునందు 'ము' 'పూ' అను వర్ణంబులకు యతి చెప్పఁబడియె.

## 8. సరసస్వరయతి:—

క. ఇరుఁగడల హల్లు నొందిన
నారపుగ నొకచోటఁ బొందియున్నను స్వరమా
విరసముగ నచ్చు లున్నన్
సరసవిరామం బటండ్రు జలరుహనాభా.

తా. పాదాదియందును, యతిస్థానంబునందునుంగాని, లేక వీనిలో నొకచోటఁగాని హల్లుమీఁద నానియున్న యచ్చు సంధివేళలందు మఱొండు స్వరముగా మాఱిపోయినను యతి మైత్రిని జెందును అని భావము. దీనికి స్వరప్రధానవళు ,లని నామాంతరము గలదు.

దీనికి నుదాహరణము:—

గీ. అతులగుణధామ భానువంశాబ్ధిసోమ
యినతనూభవమిత్ర లంకేశజైత్ర
యురుగుణకలాప శకలీకృతోగ్రచాప
నాఁగ నిట్లు స్వర ప్రధానవళు లొప్పు.

1. ఈపద్యమునందు మొదటిపాదము మొదట 'అ' యున్నది. దానికిని 'వంశాబ్ధి' యనుపదంబున (శ + అ) శవర్ణముతోఁ జేరి దీర్ఘముగా మాఱిన 'అ'కును యతిమైత్రి యయ్యె.

2. రెండవపాదంబున మొదటనున్న 'ఇ' కారమునకును, 'లంకేశ' యనుపదంబున (లంక + ఈశ) కవర్ణముతోఁ జేరిగుణముగా మాఱిన 'ఈ' కిని యతిమైత్రి కలిగె.

8. మూఁడవపాదము మొదటనున్న 'ఉ' కారమునకును 'కృతోగ్ర' యనుపదమున (కృత+ఉగ్ర) తవర్ణముతోఁ జేరి గుణముగా మాఱిన 'ఉ' కారమునకు యతిమైత్రి యొప్పెను.

9. బిందుయతి (అనుస్వారయతి)—

క. పంచమవర్గాక్షరములు

పంచమవర్ణములఁ గూడి • పరఁగ నటించుజ
వంచింపక పెర నాలుగు
నంచితముగఁ బిఱుఁద సున్న • లంటినచోటజ.

తా. సున్న ముందుగాఁ గలకవర్ణమందలి మొదటినాలుగక్షరములు జకారమునకును, అట్లె సున్న ముందుగాఁ గలచవర్గములోని మొదటినాలుగక్షరములు ఞకారమునకును, అట్లే టవర్గములో మొదటినాలుగక్షరములకు 'ణ' కారమునకును తవర్గములోని మొదటినాలుగింటికి 'న' కారమునకును, పవర్గములోని మొదటి నాలుగింటికి 'మ' కారమునకు యతిమైత్రి యొప్పును. ఇదియె బిందుయతి, (అనుస్వారయతి) యనఁబడు.

ఇందు కుదాహరణము.—

షట్పాదగీతి. జాకు వడి సెల్లు రత్నకం•కణ మనంగ
ఞాకు వడి సెల్లు బర్హిపిం•ఛం బనంగ
ణాకు వడి సెల్లు గనకమం•టప మనంగ
నాకు వడి సెల్లు దివ్యగం•ధం బనంగ
మాకు వడి సెల్లు విజితశం•బరుఁ డనంగ
జరుగు నిబ్భంగిఁ దగ నను•స్వారయతులు.

| | | | |
|---|---|---|---|
| 1. ఙా | ... | ంక | ఈరీతిగా వర్గపంచమాక్షరముల |
| 2. ఞా | ... | ంచ | కును నున్నముందుగల యాయా |
| 3. ణా | ... | ంట | వర్గములోని తక్కినయక్షరముల |
| 4. నా | ... | ంధ | కును యతి చెప్పఁబడియె. |
| 5. మా | ... | ంబ | |

## 10. స్వరయతి:—

తే. ప్రాది నిత్యసమాసశ • బ్దములు గాక
పెరపదంబులపై నచ్చు • బెరసినప్పు
డన్నియును స్వరయతు లగు • [సాంబగురుఁడ]
యింద్రుఁ డను రాన్వయాబ్ధిపూ • ర్ణేందుఁ డనఁగ.

తా. ప్రాదియతియు, నిత్యసమాసయతియు ముందుఁ జెప్పఁబోవుచున్నాఁడు గాన యిట్టి సమాసంబులందుఁ దక్కఁ దక్కిన చోటఁ బాదాదియందున్న యచ్చు విశ్రమస్థానంబున నున్న యచ్చు సంధివలన వచ్చినను దనకు మిత్రమయ్యెనేని యతి చెప్ప వచ్చును.

ఇప్పద్యంబున నాలవగీటునందు 'పూర్ణ + ఇందు' అను రెండు పదంబులును 'ఆద్గుణః' యను సంస్కృతసంధిచే ఏకారము రాఁగా 'పూర్ణేందు' అనియాయెను. పాదాదియందున్న 'ఇ' కారమునకు 'పూర్ణేందు' అనుచో సంధివశంబున వచ్చిన ఏకారము 'ఇత్వమేత్వంబు పట్రువలేకసరణి' నను లక్షణముచే మిత్రమై యతి యొప్పియున్నది యని యెఱుంగవలయును.

### 11. లుప్తవిసర్గకస్వరయతి:—

(అనంతుని ఛందంబునందు)

తే. స్వరముతుదనుండి లుప్తవిసర్గకోత్వ
మైన స్వరవిరామంబు దాసోఽహ మనఁగ
నచ్యుతాశ్రితు లుర్వి నన్యోన్యమిత్రు
లన ముకుందుండు విమలయశోఽర్థి యనఁగ.

తా. సంస్కృతసంధులలో విసర్గసంధిప్రకరణంబున నొక సంధి చెప్పఁబడియున్నది—'దాసః + అహమ్' అనుచో 'విసర్జనీయస్యసః' అనుసూత్రంబుచే విసర్గకుసకారము రాఁగా, దాసస్ + అహమ్ అని యయినది. 'ససజుషోరుః' అను సూత్రముచే సకారమునకు రేఫము రాఁగా, దాసర్ + అహమ్ అని కాఁగా, 'అతోరోరప్లుతాదప్లుతే' అనుసూత్రముచే రేఫమునకు ఉకారము రాఁగా, దాసఉ + అహమ్ అని యేర్పడఁగా 'ఆద్గుణః' అను సూత్రముచే, సకారముపైని అకారమునకు ఉకారమునకు, ఓకారమువచ్చి, దాసో + అహమ్ అని రూపము సిద్ధింపఁగా, 'ఏఙః పదాన్తాదతి' యనుసూత్రముచే పూర్వరూపము వచ్చుసరికి దాసోఽహమ్ అని రూపంబయ్యె 'అహమ్' అనుదాని లోని 'అ'కారము ఓకారములోఁ జేరిపోయెను. ఇట్లే అన్యోన్యము. యశోఽర్థి యను పదములును సిద్ధించినవి.

1. దాసః + అహమ్ = దాసోఽహం
2. అన్యః + అన్యంబు = అన్యోన్యంబు
3. యశః + అర్థి = యశోఽర్థి

పైమూఁటియందునుండు అకారము ఓకారముతోఁ జేరి మఱఁగియున్నది. అట్లు మఱఁగియున్నను, అ, ఆ, ఐ, ఔలు మిత్రంబు లని చెప్పఁబడియున్నందున రెండవపాదము మొదట నున్న ఐకారముతో। దాసోహ మనుచో ఓకారములో మఱఁగి యున్న అకారము మిత్రత్వంబు నొంది యతియై యొప్పినది. ఇట్లే మూఁడవపాదంబున అకారమునకు అన్యోన్య యనుచోట నున్న అకారమును, నాలవపాదమున అకారమునకు 'యశోర్థి' యనుచో నున్న అకారమును మిత్రంబు లయియతులయి యొప్పుచున్నవి.

తే. తాయెతు నుయ్యెల యుఁబయ్యె♦దయును దక్కఁ
గలుగ దెత్వంబు మధ్యయ♦కారమునకుఁ
దుదలఁ గ్రియలందు నెత్వంబు♦గదియు వాని
కత్వ మిడరాదు తెనుఁగున♦[నబ్జనాభ.]

తా. తాయెతు, ఉయ్యెల, పయ్యెద యనుమూఁడు నామంబులయొక్క మధ్యనున్న యకారము, కనియెన్, చనియెన్, వినియెన్ మొదలగు భూతార్థక క్రియాపదములయొక్క తుదనున్న యకారమును ఎత్వముతోఁ గూడినదే కాని, అత్వముతోఁ గూడినది కాదు. కావున తాయతు, ఉయ్యల, పయ్యద, కనియన్, వినియన్, చనియన్—అనుట తప్పు. తాయెతు, ఉయ్యెల, పయ్యెద, కనియెన్, చనియెన్, వినియెన్ అనుట సరి యని తాత్పర్యము.

తాయెతుఅనుపదమునకులక్ష్యము;—(చంద్రభానుచరిత్రము)

సీ. ఒకకాంత యొఱఁగిన ♦ సికమీఁదిముడిపువ్వు
బెత్తులుమెఱయ దా♦యెతులు చుట్టి....

ఈపద్యంబున 'పువ్వు'+ఎత్తులు = పువ్వుబెత్తులు' అని సంధియయ్యెను. 'పువ్వుబెత్తు' అనుచోట టకారముమీఁద నున్న ఎకారమునకు, తాయెతు అనుపదముననున్నయకారంబు మీఁది ఎకారమునకు యతి చెల్లినది. ఇది తాయెతు అనుదానికి నుదాహరణము.

ఉయ్యేలకు లక్ష్యము:—(విక్రమార్కచరిత్రము)

క. వల నొప్పఁగ నపు డాయు
య్యేలలోఁ జల బాలు నునిచి ♦ యిందునిభాస్యల్
కలకంఠనాదమాధురిఁ
బలుమఱుఁ జెలరేఁగి జోలఁ ♦ బాడిరి ప్రేమన్.

ఈపద్యంబున రెండవపాదంబునందలి ఉయ్యేల యనుపదములోనియకారముమీఁది 'ఎ' కారమునకును 'ఇందునిభాస్యల్' అనుచోట 'ఇ' కారమునకును యతి చెల్లినదియనిలక్ష్యము చూపింపఁబడెను.

ఇంకఁ బయ్యెద యనుదానికిలక్ష్యము:—(యయాతిచరిత్రము)

సీ. వలఁబడ్డ జక్కవ♦ల్వలె నున్నజిలుగుబ
య్యెదలోనిగుబ్బపా♦లిండ్లు నెరయ....

ఈపాదంబునఁ బర్యేద యనుపదములోని యకారము మీఁది ఎకారమునకును 'పాలిండ్లు' అనుచో లకారముమీఁది యికారమునకును యతిచెల్లినది.

12. ఋవళి:—

తే. క్షితిఋకారగస్వరూపమై • యతులు పరఁగు
ఋగ్యజుస్సామవినుతుండు • కృష్ణుఁ డనఁగ
వృష్ణికులజుండు గరుణాస•మృద్ధుఁ డనఁగ
హేమపీతాంబరుఁడు దేవ•వృషభుఁ డనఁగ.

తా. కేవల ఋకార, ౠకారంబులు కకారము మొదలగు హల్లులతోఁ జేరిన వట్రువసుడు లన్నింటికినిఁ జెల్లును. ఇ, ఈ, ఋ, ౠ, ఎ, ఏ, యను నీయచ్చులతోఁ గూడిన హకార యకారములు వట్రువసుడితో మైత్రి, నొందును.

ఈ పద్యమున రెండవపాదంబున ఋకారమునకును కకారముమీఁది వట్రువసుడికిని యతి చెప్పఁబడెను. మూఁడవపాదమున వకారముమీఁద నున్న వట్రువసుడికిని మకారమునకును యతి చెప్పఁబడియె. నాలవపాదమునందు 'హే' యనుచోట హకారముమీఁదనున్న 'ఏ' కారమునకును 'వృషభ' యనుచోట నున్న వకారము మీఁద వట్రువసుడితో యతి చెల్లెను. ఈఋవళినే ఋత్వసంబంధవళి యనియుఁ జెప్పుదురు.

దీని కుదాహరణము:—(దశకుమారచరిత్రము).

ఆ. ఋభులు సంతసిల్లఁ • గృతముఖ్యు లరు దంద
దితిజతతికి నెల్ల • ధృతి గలంగఁ

దృణముమాడ్కి దాన • వేంద్రునిఁ దునుమాడి
జయము నొందు వేగ • జగదధీశ.

పైపద్యంబున మొదటిపాదము మొదటినుండి ఋకారమునకును, యతిస్థానంబునందున్న గకారముమీఁది వట్రువసుడికిని, ద్వితీయపాదాదియందున్న దకారముమీఁది ఇకారమునకును, విశ్రమస్థానంబునందున్న ధకారముమీఁది వట్రువసుడికిని, మూఁడవపాదము మొదటనున్న దకారముమీఁది వట్రువసుడికిని, విశ్రమస్థానంబున నున్న వకారముమీఁది ఏకారమునకును యతిచెల్లినది యని యెఱుఁగవలయును.

## 12. మూవళి:—పెద్దిరాజుఛందము.

తే. య ర ల వలు శ ష స హాలును • నాదిబిందు
యుతములై మకారపరము • యుక్తిఁ దనరు
మారుతాత్మజుఁ డరిది సం • యమి యనంగ
మదనజనకుండు దనుజసం • హారుఁ డనంగ.

పూర్ణబిందుపూర్వము లైన య, ర, ల, వలు, శ, ష, , స, హాలును మకారముతో మైత్రి నొందును.

ఇందులకు దాహరణము—పైపద్యంబున మూఁడవపాదములో మొదటి మకారమునకు బిందుపూర్వక యకారంబును, నాలవపాదములో మొదటిమకారమునకు బిందుపూర్వకహకారమును యతియందు మిత్రములని యెఱుంగునది.

ఇందులకు లక్ష్యము:—(దశకుమారచరిత్రము).

క. కమలాప్తాంశులు బలవి
క్రమవంతులు ఖడ్గధరులు ♦ రాజులు మీరల్
మముఁ బ్రోవఁగఁ దగదే సం
యమివర్యులఁ జూచి రాకు♦మారకు లెల్లన్.

ఇచట నాలవపాదంబున యకారము మొదట సున్నతోఁ గూడియున్నది గావున విశ్రమస్థానమం దున్నమకారముతో విశ్రమంబు నొందినది యని యెఱుంగునది.

మఱియొకయుదాహరణము:—(భీమకవి).

చ. గరళపుముద్ద లోహ మవ
♦గాఢమహాశనికోట్లు సమ్మెటల్
హరునయనాగ్ని కొల్మి యుర
♦గాధిపుకోఱలు పట్టుకార్లు ది
క్కరటిశిరంబు దాయి లయ
♦కాలుఁడు కమ్మరి వైరివీరసం
హరణగుణాభిరాముఁ డగు
♦మైలమభీమన ఖడ్గసృష్టికిన్.

పైపద్యంబున నాలవగీటు మొదటనున్న హకారము సున్న ముందుగాఁగలది గాన విశ్రమస్థానంబున నున్నమకారముతో మైత్రిని బొందినది.

13. ప్రభుయతి:—(అనంతునిఛందంబునందు),

తే. ఒనర నన్నమ్మ యనుచోట నూఁదఁబడక
ద్వివిధ మగు ప్రభునామాంతరవిరమణము
మహి నయోధ్యను రాజు రామన యనంగ
నతనిపట్టపుదేవి సీతమ యనంగ.

తా. అన్న యమ్మ శబ్దములు ద్విత్వములేక పలుకఁబడునేని యాశబ్దాదియందున్న అకారము విశ్రమస్థానంబునందున్న అచ్చుతోను, హల్లుతోను విశ్రమము నొందును.

దీనికి లక్ష్యము పై పద్యమునందు మూఁడవపాదమున నున్న ‘రామన’ యనుచోటను, నాలవపాదంబునం దున్న సీతమ యను చోటను చూడఁదగినది.

ఈ యతియందు ‘అన్న’ ‘అమ్మ’ యను నీరెండుపదములకు దక్కిన పదముల మొదటనున్న యకారము సంధిచేత నిత్యద్విత్వంబు నొందినదైనను, అచ్చుతో యతి సెప్పరాదు. హల్లుతో యతి సెప్పవలయును.

ఇందుకు పెద్దత్త, చిన్నల్లుఁడు, కన్నయ్య యను నిట్టిపదంబులయం దీప్రభువిరామ మను పేరు గల యుభయయతి చెల్లదని ‘అన్న’ ‘అమ్మ’యను రెండుపదములను మాత్రము చెప్పుటచేత నూహించునది.

దీనికి లక్ష్యము:—(భీమకవి).

మ. ఘనుఁడన్ వేములవాడవంశజుఁడ దా
క్షారామభీమేశనం

దనుఁడఁ దివ్యవిషామృతప్రకటనా
♦నాకార్యధుర్యుండ భీ
మన నాపేరు వినంగఁ జెప్పితిఁ దెలుం
♦గాధీశ! కస్తూరికా
ఘనసారాదిసుగంధవస్తువులు వే
♦గం బిచ్చి లాలింపురా.

పైపద్యమున మూఁడవపాదంబున 'భీమన' యనుచోట మకారంబుమీఁద నిత్యసంధియయిన అకారమునకును విశ్రమస్థానంబునందుండు అకారమునకును సంస్కృత సంధియందు సవర్ణదీర్ఘము వచ్చినది గాన దీనితో యని సెల్లునని లక్ష్యము చూపఁబడియె.

## 14. విభాగయతి:—

తే. సంఖ్యకుం బరిమాణసం♦జ్ఞకుఁ దనర్చు
శబ్దములపై విభాగోక్తి♦ సరణి సంఘ
టించినప్పుడు యతులు రెం♦డేసి యగు ను
పేంద్రుఁ డిచ్చు ధనము మూఁ♦డేసి యనఁగ.

తా. సంఖ్యానిర్ణయమును జేయునట్టి యేసి యనుపదము సంధియై యున్నచోటఁ బదవిభాగంబు చేయునెడల నచ్చునకును, హల్లునకును విశ్రమంబు చెల్లవచ్చును.

ఇచ్చట నాలవపాదము మొదట ఉప + ఇంద్రుఁడు అని యుండఁగా, గుణము రాఁగా వచ్చిన ఏకారమునకును, విశ్రమ

స్థానంబునందు మోపెఁడు + ఏసి అని యుండఁగా, డకారము మీఁదనుండు ఊకారమునకు పరమైన ఏకారము నిత్యసంధియై 'డేసి' యని రూపము సిద్ధించెను గాన దీనితో విశ్రమంబు సెల్లెను.

మఱియొక లక్ష్యము:—

క. ఆసేనలఁ గని కినిసి మ
హాసాయకవృష్టి ముంచి • యనేకులపై నై
దేసి పదేసి మఱియు నూ
ఱేసి శరములు నిగిడించె • రిపు లదరంగన్.

పై పద్యంబున నాలవపాదంబునందు నూఱు + ఏసి యని యుండఁగా, ఱకారముమీఁదనున్న ఊకారమునకు ఏసిపదమందున్న ఏకారమునకు నిత్యసంధియయినది గాన ఱేత్వముతోఁ గూడిన రేఫమునకును విశ్రమస్థానమునందున్న రిపు లనుచోటఁ బదాదియందున్న ఇకారముతోఁ గూడిన రేఫమునకును విశ్రమంబు సెల్లినదని లక్ష్యము చూపించినాఁడు.

15. సౌభాగ్యయతి:—(లక్షణ[illegible])

తే. ఉభయమునకు సెల్లుయతులు రెం • డొక్కపదము
నందు నెలకొన్న సౌభాగ్య • యతి నెలంగుఁ
భ్రాంచితామరవినుత వే • దండవరద
నాకరిపుశిక్ష శౌరి య • నంత యనఁగ.

ఒక పదమునందు అచ్చుహల్లులకుఁ జెల్లుబడి యైనయక్షరమున్న, రెండింటిలోఁ దేనినైనను విశ్రమంబుగాఁ జెప్పుట సౌభాగ్యయతి యనఁబడును.

అందులకు లక్ష్యము:—(భారతము).

క. భండనమున నెదిరినరిపు
మండలముల నెల్లఁ గినిసి ♦ మర్దించి మదో
ద్దండుండై కవ్వడి మా
ర్తాండసుతుం దొడరి పోరె♦నాకులు మెచ్చన్.

ఇచ్చట నాలవపాదంబున'మార్తాండ'యనుచోట (మృతం అండం బ్రహ్మాండం జీవయతీతి మార్తాండః)అను వ్యుత్పత్తిచేరెం డుపదములు సంధించునపుడు సవర్ణదీర్ఘము వచ్చెఁగాన నొక్క పదంబై యొకవ్యక్తి చెప్పినందున నీవిశ్రమము స్వరయతులలో విశేషయతి యని యూహించునది. మఱియు అండ శబ్దము మొదటనున్న అకారమునకును, విశ్రమస్థానంబుననున్న నాకు లనుశబ్దమందు (కం=సుఖం, తన్నభవతీతి అకం=దుఃఖ మిత్యర్థః. తత్ర తన్నాస్తీతి నాకః) అను వ్యుత్పత్తిచే నిచటను బదద్వయముచే నొకపదమయి యొక వ్యక్తినే చెప్పినది. మఱియును అక శబ్దాదియం దున్న అకారమునకును విశ్రమంబు సెల్లిన దని లక్ష్యము సూచించినాఁడు.

## 16. ప్రాసయతి:—(లక్షణచూడామణి.)

తే. పాకశాసనసుతుఁడు లో♦కైకవీరుఁ
డనఁగఁ దగుఁ బ్రాసవిరతు లి ♦ ట్లలరె నేనిఁ
జారుతరహాసకీర్తిప్ర♦చారుఁ డనఁగఁ
బ్రాస యతి; గాదు వర్గువు ♦ [పంకజాక్షి.]

తా. ప్రాస మనఁగాఁ బాదమునందు రెండవయక్షరము. మొదటియక్షరమునకుఁ దగినవిశ్రమంబు చెప్పక ప్రాసము ననుసరించి యతి చెప్పుట ప్రాసయతి యనఁబడును.

ఇచట మొదటి పాదమునందు రెండవయక్షర మగు 'క' ప్రాసముగాన విశ్రమస్థానంబునందున్న 'కైక' యను పదము లో 'కై' యనుదానికి యతి సెప్పక 'క' కారముతో యతి సెప్పఁబడియున్నది గాన నిది ప్రాసయతి యనఁబడియె నని యెఱుంగవలయు, ప్రాసమునకు స్వరనియమము లేదని గీత మునఁ బ్రాసవిశ్రమములలో నెద్దియైనం జెప్పవచ్చు ననియును ముందుఁ జెప్పఁగలఁడు.

ఇట్లు మూఁడవపాదమున 'చారు' 'చారు' అని ప్రాసయ తులు రెండును గలిసియున్నవి గాన నిచ్చోట వర్గయతియే గ్రహింపవలయును గాని ప్రాసమును గ్రహింపఁగూడదని కవియభిప్రాయము. అట్లు ప్రాసమును నిషేధించుటవలనఁ బ్రయోజనం బెద్దియో తెలియలేదు.

## 17. భిన్నయతి:—(అనంతుఁడు).

క. అంచితతిలకము శౌరి ధ
రించె నన జగణమధ్య • రేఫశిరతి నైయె
యంచితతిలకము శౌరి ధ
రించె నన భిన్నవడికి • నిత్వము వచ్చెన్.

తా. 'లఘువగునొక్క యక్షరము ముందుగాఁగ అసంస్కృత ధాతువులకు నియోగాగమంబు విభాషనగు' నను బాలవ్యాక

రణము క్రియాపరిచ్ఛేదము 50 వ సూత్రము ప్రకారము వచ్చునట్టి యకారము యతిస్థానంబునందు వచ్చుతతి భిన్నయతి యనఁబడును.

ఇందుల కుదాహరణము మీఁదిపద్యము నాలవపాదమున '(ధృ + ఇంచు = ధర్ + ఇంచు=ధర్ + ఇయ్ + ఇంచు)='ధరియించు' అనుపదములోని నాగమముగా వచ్చినయకారమునకు 'ఇ' త్వ మనుచో 'ఇ' కారమునకును యతి సూచింపఁబడియె.

ఇందులకు లక్ష్యము:—(దశకుమారచరిత్రము).

క. మించి మదించినరిపుల హ
రించక సత్కీర్తి యీమహీశల నెల్లన్
నించక దీనుల దయఁ బో
షించక ప్రఖ్యాతి గల్గునే[నరనాథా.]

పైపద్యము రెండవపాదము మొదట నున్న రేఫముమీఁది యికారమునకు యతిస్థానంబున 'హీ' యను వర్ణమునకును యతి యనియు, నాలవపాదంబున షకారముమీఁది యికారమునకును యతిస్థానమునం దున్ననకారముమీఁదనున్న ఏకారమునకును యతిసెల్లినది యని లక్షణసమన్వయము చేయఁబడియె.

18. ప్రాదియతి:—(కవిగజాంకుశము).

క. ప్రపరాపసమనుసుప్ర
త్యపినిస్దురభిన్యుపాభ్యుఁదాఙ్ వ్యత్యవప

ర్యుపసర్గవింశతికి వ
ల్లు పరస్పరయోగ మైన • నుభయము చెల్లున్.

తా. ప్ర, పర, అప, సమ్, అను, వు, ప్రతి, అపి, నిర్, దుర్, అధి, ని, ఉప, అభి, ఉత్, ఆఙ్, వి, అతి, అవ, పరి,—ఇవి ప్రాదులు. ఈప్రాదులు సంధిరై పాదాదివిశ్రమ స్థానంబులం దుండె నేని కొన్నిచోట్ల నచ్చులకును, కొన్ని చోట్ల నజ్ఝల్లులకు నంటికిని మిత్రత్వంబు గలుగు.

దీనికి లక్ష్యము.

తే. అబ్జయోని రజోగుణ • ప్రాప్తిఁ దనరుఁ
బద్మనాభుఁడు సాత్విక • ప్రాప్తిఁ దనరు
రజతగిరిమందిరుఁడు తమగ • ప్రాప్తి దనరు
ననఁగ నిబ్భంగిఁ బ్రాముల • నమరు యతులు.

పైపద్యంబున మొదటి పాదంబున అకారమునకును ప్రాప్తి యనుచో 'ప్ర' యనునుపసర్గమీఁది అకాగమునకును, రెండవ పాదమున పకారమునకును 'ప్ర' యనునుపసర్గలోనిపకారమున కును, మూఁడవపాదమున రేఫమునకును, 'ప్ర' యనునుపసర్గమునం దున్న రేఫావడికిని యతి మైత్రియగుటం జేసి యిది ప్రాదియతి యని చెప్పఁబడు.

19. అభిన్నయతి:—(లక్షణచూడామణి.)

క. ఇంచియును నచ్చు హల్లు ను
దంచితముగ నంది గూడు • నవ్వా డభిన్నం

బెంచఁగ బొలుఁడు హరిఁ బలి
కించె ననఁ రెండుఁ జెల్లు నెలమిం గృతులన్.

తా. ఇంచు అనునది కొన్ని ధాతువులకు స్వార్థమందును మఱికొన్నింటికిఁ బ్రేరణార్థకమునందును వచ్చునట్టి ప్రత్యయము. ఈ 'ఇంచు' అనుదానిలోని ఇకారమునకు మైత్రిగలస్వరమైనను హల్లయినను యతియందుఁ జెల్లును.

దీనికి లక్ష్యము—పైపద్యమున నాలవపాదము మొదటనుండు 'పలికించె' ననుచోట కకారము మీఁది ఇకారమునకును విశ్రమస్థానమం దున్న 'ఎలమి' అనుపదములో నున్న ఎకారమునకును యతి చెల్లినది యని యెఱుంగునది.

ఇందుకు లక్ష్యము:—(ప్రద్యుమ్నోపాఖ్యానము).

క. పంచశరుం డనఁగను జా
లించి మహాప్రధనభూమి నీక్షించి మదో
దంచితుఁడై శంఖముఁ బూ
రించెం గులగిరులు దిక్కరివ్రజ మడఁగన్.

ఇచట రెండవపాదమున 'లించి' అనుచోటలకారముమీఁది ఇకారమునకును, ఈక్షించియనుచోట నున్న ఈకారమునకును యతి చెల్లె నని లక్ష్యము చూపఁబడెను.

భిన్నయతికిని, అభిన్నయతికిని గలభేదము.

క. భిన్నయతి జగణమధ్యమ
భిన్నము దక్కినగణాళి పెం పెనసినచో

భిన్నమున హాల్లుచెల్లు న
భిన్నమునకు రెండుఁ జెల్లు ♦ [భీభత్సనుతా.]

తా. భిన్నయతి జగణమధ్యమున నున్నవర్ణమునకే కాని తక్కినగణములందుఁ జెల్లదు. అభిన్నయతి యన్ని గణంబుల యందు నుండవచ్చును.

లక్ష్యము.—

క. కాంచనచేలునిఁ బ్రేమ ను
తించె న్నుతియించె ననఁగ ♦ నొగి భిన్నంబా
కొంచక పోషించె న్వెను
తించె ననఁగ భిన్నవిరతి ♦ యిటుల నెలఁగుర్.

ఇచట రెండవపాదంబుననుతించెన్ నుతియించెన్ అనుచోట వికల్పముగా వచ్చిన 'ఇ' కారము భిన్నమయినది గాన నిది భిన్నయతి యని లక్ష్యము సూచింపఁబడియె.

## 20. అభేదయతి:—

క. వబయో రభేద యనియెడు
నెపమున ప ఫ బభ లు వాకు ♦ నేర్పునవడిగా
నుపమింపవచ్చుఁ గృతులం
దుపనిషదుచితార్థసూక్తు♦లొలసినచోటన్.

తా. వకార బకారములకును, రకారలకారములకును, డకార శకారములకును, భేదంబు లేదని సంస్కృతమునఁ జెప్పఁబడును.

గాన వాని కభేదయతి చెల్లును. మఱియు వకారమునకును ప, ఫ, బ, భలు నాలుగును జెల్లును.

లక్ష్యము:—

తే. లలితవీణారవంబుతో ♦ డక్క సరియె
రమ్యమణిరాజరాజితో ♦ లక్క సరియె
భరితభువనార్ణవంబుతో ♦ వంక సరియె
యనఁగను నభేదనామాఖ్య ♦ యతులు సెలఁగు.

ఇందు మొదటిపాదమున 'లడయో రభేదః' అనుటచే 'ల' 'డ' లకు యతి చెప్పఁబడియె. రెండవపాదమున 'రలయో రభేదః' అనుటచే, 'ర' 'ల' లకు యతి చెప్పఁబడియె. మూఁడవ పాదంబున 'వబయో రభేదః' యనుటచే 'భ' 'వ' లకు నభేద యతి చెప్పఁబడియె నని లక్ష్యము చూపఁబడియె.

## 21. వృద్ధియతి:—

క. ఏకైకము సోదరనా
కౌకసు లనుశబ్దములకు ♦ నచ్చటినడిగా
నైకారౌకారంబులు
గైకొనఁ జను వృద్ధివళ్లు ♦ కవు లొడఁబడఁగన్.

తా. సంస్కృతమునందు అకార ఆకారములకు ఏ, ఓలు పరంబులగునపుడు క్రమంబుగా వానికి ఐకార ఔకారములు ఆదేశములగును. అట్టు ఆదేశముగా వచ్చిన ఐకార, ఔకారములు వరుసగా ఏకారాదులకును, ఓకారము మొదలగు వాని

కిని మిత్రములగును. ఏక + ఏక = ఏకైక, నాక + ఓకసులు = నాకౌకసులు అని వృద్ధిసంధి వచ్చెను.

దీనికుదాహరణము:—(భాస్కరరామాయణము).

శా. నీకంఠార్పితకాలపాశము శిరో
 ♦ నిర్ఘాతపాతంబు లం
కౌకస్సన్నుతకాలరాత్రిగళబ
 ♦ ద్ధోదగ్రకాలాహిక
న్యాకారాగతమృత్యువుర్జనకక
 ♦ న్యా న్వేగ నిప్పించి లో
కైకత్రాణుని రాముని౦ గనుము నీ
 ♦ కీబుద్ధి గాకుండినన్.

పైపద్యము రెండవపాదంబున 'లంకా + ఓకస్' అని యుండ సంధివశంబున ఔకారంబు వచ్చినను మున్నున్న ప్రకృతి స్వరూపమైన ఓకారమునకును 'యతిస్థానమందు 'బద్ధ + ఉదగ్ర' మనియుండఁగా సంధివశంబున ఓకారంబు వచ్చినను మొదట నున్న ఉకారమునకును యతి చెల్లినది యని లక్ష్యము చూపంబడెను. ఇట్లే 'లోకైక' యనుచోట ఐకారమునకును విశ్రమస్థానమందున్న ఆకారమునకును యతి చెలంగెనని యెఱుంగునది.

## 22. నిత్యసమాసయతి:—(అనంతుఁడు).

ఆ. ఏనియును పదంబు ♦ తోనాది విధమంది
 సంధి నిత్యయుతులు ♦ జరగు రెండు

నెట్టికూ్రరకర్ము ◆ డేని సద్గతి నొందు
నిన్ను నాత్మఁ దలఁచె ◆ నేని [కృష్ణ].

తా. ఏని పదంబు సంధియందు హల్లుతోఁ జేరనేని, దానికిని అచ్చునకును హల్లునకును యతి సెల్లును. దీనిని నిత్యసమాస యతి యందురు. దీనికి లక్ష్యము—ఈ పద్యమున మూఁడవపాదము మొదట నున్న 'ఎట్టి' యనుదానిలోని ఎకారమునకును విశ్రమస్థానంబునందున్న ఏని యనుదానిలోని 'ఏ'కారమునకును విశ్రమంబు చెల్లినది యని యెఱుంగుము.

మఱియు లక్ష్యము:—

తే. పదము విభజించి చెప్పఁ జొ ◆ ప్పడనియదియు
నన్యశబ్దంబుఁ గాని విగ్ర ◆ హంబుఁ జెప్ప
నదియు నిత్యసమాసమై ◆ యతులఁ గృతుల
నంటి సంధిని నచ్చుహ ◆ ల్లయిన విరతి.

తా. రెండుపదములుచేరి యొక్కపదమైనట్లుండి,పదవిభాగము చేయుటకు యుక్తము గానిచోటను అన్యపదవిగ్రహ సమాసమునందును అచ్చులలోఁగాని, హల్లుతోఁగాని యతిసెల్లునని యభిప్రాయము.

కర్ణాట, వనౌకస, ద్వీప, అంతరీప, నాస్తిమొదలగు పదంబులు

వనౌకశ్శబ్దమునకు లక్ష్యము.—

(అథర్వణాచార్య విరచితవిరాటపర్వమునందు)

క. శ్రీకంఠుఁ డెదురునపుడు వ
నౌకోధ్వజ మింద్రమకుట ◆ మర్జునతురగా

నీకము దివ్యశతాంగము
నాకవ్వడి కబ్బియున్న ♦ నతఁ డేమగునో.

ఈపద్యమున రెండవపాదములోని 'న' కారముమీఁది 'ఔ' కారమునకును యతిస్థానంబునందున్న 'అ' కారమునకును యతి సెలంగెనని తెలియవలెను. ఇట్లే కర్ణాటాదులకూహించునది.

## 23. ప్లుతయతి:—(అనంతుఁడు).

క. ప్లుత మనఁ బరగుఁ ద్రిమాత్రా
న్వితవర్ణము దానిమీఁది ♦ విదితస్వరముల్
కృతి నయ్యక్షరములు చనుఁ
జతురాననసదృశ వళ్లు ♦ చక్కటి కెల్లన్.

తా. మూఁడుమాత్రలకాలముగలయచ్చు ప్లుతమనఁబడును. పాదాదియందును నేవర్ణముమీఁదనైనను బ్లుతకు ముందు నేని హ్రస్వదీర్ఘములతో యతి సెల్లును. మాత్రయనఁగ—జేముడు కాకి కడుపునిండ మేసి రెండుసారులుముక్కినంతకాలము. అవి రెండైన దీర్ఘమనఁబడును. అవి మూఁడైనప్లుతమనఁబడును. అవి నాలుగైన రంగప్లుత మనఁబడును.

ప్లుతము పలుకఁబడుకాలము;—

క. దూరాహ్వానమునందు మ
హారోదన గానసంశ ♦ యార్థములతుదిన్
చేరువ నగు నాద్యచ్చుల
నారూఢిం బ్లుతమువడిను ♦ హత్త్వముమెఱయన్.

తా. దూరముననుండువానిం బిలుచుట, ఏడ్చుట, పాడుట, సంశయపడుట యనునర్థములం దుచ్చరించు శబ్దాంత్యవర్ణము పాదము మొదట నైనను, యతిస్థానమందైనను నుండెనేని, దాని మీఁద ప్లుత మవశ్యముగా నుండునుగాన హ్రస్వదీర్ఘములతోఁ గూడినహల్లుమీఁద న చ్చూఁదకపోయినను, నాव్యంజన స్వరంబులు రెండును విశ్రమమునకుఁ జెల్లును.

## 24. నాదేశయతి:—[అనంతుఁడు].

క. ద్వీపమునకు నాకమునకు
నాపై నార్యోక్తి వచ్చు ♦ నాదేశసమా
సాపత్తిగలుగుటయు వ
ల్లాపాదింపుదురు గొంద ♦ అచ్చును హల్లున్.

తా. ద్వీపశబ్ద నాకశబ్దములు విశ్రమస్థానంబుననుండెనేని నాకశబ్దములోని 'న' మీఁద అకారమునకును, ద్వీపశబ్దములోని 'ద్వ' మీఁది 'ఈ'కారమునకును పాదము మొదటఁగాని విశ్రమస్థానమునఁగాని యున్నయక్షరముమీఁద స్వర మూఁదకపోయినను, ఆస్థానముననున్న స్వరహల్లులలో దేనితోనైనను విశ్రమము చెల్లును.

ఇందులకు లక్ష్యము.—(ఆదిపర్వము).

ఉ. ద్వీపుల ద్రుంచి విశ్వజగ
♦ తీధరుఁ డుత్తమ మైనజాంబవ
ద్వీపమునందు గోవులను
♦ నిమ్ముగఁ జేయుటయు న్ప్రసిద్ధమై

గోపతిధేను వద్విభున
 ♦సర్గ ధన మిచ్చిన నిచ్చెఁ గాక నే
భూపతు లివ్వదాన్యగుణ
 ♦బుద్ధి ప్రసిద్ధి వహించి రుర్వరన్.

పైపద్యము రెండవపాదమున నున్న ద్విపశబ్దములోని దృకారము మీఁదనున్న ఈకార మూఁదఁబడక పోయినను, యతిస్థానమున నున్న ఇకారముతో యతి చెల్లె నని లక్ష్యము చూపినాఁడు.

నాకశబ్దమునకు లక్ష్యము (రాజశేఖర చరిత్రము).

క. నీకరవాలనిహతులై
 నాకంబున కేఁగి రాజ♦ నారాయణ యా
 భూకాంతు లెంత చలమో
 నాకపిటస్త్రీముల దూల♦ నాడుదు రెలమిన్.

పైపద్యమున రెండవపాదంబునందున్న నాకశబ్దమునందున్న నకారముమీఁది అకారమునకును, నారాయణశబ్దము మొదట నున్న 'నా' యనువర్ణంబుమీఁద స్వర మూఁదకపోయినను యతి చెల్లునని లక్ష్యము సూచింపఁబడినది. ఇట్లు నాలవపాదమున 'నా' కును, ఆడుదు రనుచో మొదటనున్న 'ఆ' కును యతి చెల్లెనని యెఱుంగవలయు.

మఱియు భారతము.

ఉ. ఓకమలాక్షి! వింటివె సు
 ♦యోధనుతోఁ గురుసేన లెల్లఁ జీ

కాకుపడంగ ధర్మజుఁడు
♦గౌతుక మందఁగ నీవు మెచ్చఁగా
నాకవిభుండు లేఖతతి
♦యచ్చెరుపాటున నన్నె చూడ నే
నేకములా ప్తవృత్తి వధి
♦యించెదఁ గార్యము నిర్వహించెదన్.

ఇచట మూఁడవపాదమున, 'నాక' శబ్దమువీడఁదీయ, 'న + అక' యనియగును. ఆ 'అ' కారమునకును విశ్రమస్థానంబుననున్న 'అ' కారమునకును యతిసెలంగెనని యెఱుంగునది.

25. వికల్పయతి.

తే. హాయుతవర్గువులు వికల్ప ♦ యతులఁ జెల్లు
దేవకీనందనుఁడు జగ♦ద్ధితుఁ డనంగ
హాలధరుఁడు సంగరాంగణో♦ద్ధతుఁ డనంగ
నవని మోచినయవి కకు♦బ్భస్తు లనఁగ.

తా. హాకారములోఁ గూడినయన్నివర్గులకును పాదము మొదటఁగాని, విశ్రమస్థానంబునందుఁగాని యున్నయచ్చు తోఁగాని హల్లుతోఁ గాని యతి చెలంగును.

దీనికి లక్ష్యము—పైపద్యము ద్వితీయపాదము మొదట నున్నదకారముమీఁది ఏకారమునకును, జగత్ + హితుఁడు అని రెండు చేర్పఁగా, జగద్ధితుఁడని 'త్ హి' రెండును ద్విత్వ సహితంబుగా 'ద్ధి' యని యాయె. అట్టివర్ణమునకును ఉభయ

యతి చెల్లెను. అట్లు మూఁడవ పాదమునందు హాకారంబునకు యతి స్థానంబునందున్న 'ధ' కును యతి. నాలవపాదంబున అకారమునకును యతిస్థానంబునందు కకుప్ + హాసులనియుండఁగా పకార హాకారములకు బదులుగా వచ్చిన 'బ్భ' కును నుభయ యతి చెల్లును.

ఇందులకు లక్ష్యము. (దశకుమారచరిత్రము).

క. సుతకీర్తి వడసి సుజన ప
ణితులై వర్ధిల్ల దుష్ట•నిగ్రహశిష్ట
ప్రతిపాలకులై త్రిజగ
ద్ధితముగ నేలంగఁ దగు మ•హీతల మెల్లన్.

ఇచట నాలవపాదము మొదట 'ధి' యనుదానిలోని నున్న హికారమునకును విశ్రమస్థానంబునందున్న 'హీ' కారమునకును యతి విలసిల్లె నని లక్ష్యము చూపఁబడినది.

## 26. అనునాసికవికల్పయతి.

తే. నలి గకారహల్లున కను•నాసికాఖ్య
గదిసి తత్సమశబ్దవి•కల్పవిరతి
గలుగుఁ జక్రివిమలసుదృ•జ్జ్యోతుఁ డనంగఁ
గమలనేత్రుఁడు సకలది•జ్మహితుఁ డనఁగ.

తా. కకారమునకును జకారమునకు యతి చెల్లును. పైపద్యమునందు మూఁడవ పాదము మొదటనున్న కకారమునకును యతిస్థానమునందు వికల్పముగా కాక బదులుగా వచ్చిన జాకును యతి సెలంగె నని యెఱుంగునది.

ఇందులకు లక్ష్యము (భారతము.)

క. మగతనముఁ జూపఁజాలక
మగఁటిమి చెడి విఱిగి పాఱు ♦ మనసైన్యములోఁ
జగదేకుండు రుచిచేఁ బ్రా
జ్ఞగమున వెలుఁగొందురీతిఁ♦గవ్వడి పొలిచెన్.

ఇచట నాలవపాదము మొదటనున్న 'జ్ఞ' యనుదానిలోని క కారమునకు, విశ్రమస్థానముననున్న 'కవ్వడి' శబ్దముయొక్క మొదటి 'క' వర్ణముతో యతి చెల్లినది. ఈయతి నప్పకవి నిందించినను భారత ప్రయోగంబున్నది గాన నెల్లరు కవులును సమ్మతించినారు.

## 27. కాకుస్వరయతి:—

తే. వరుస దీర్ఘాంతసంబుద్ధి♦వచనయతులు
నమరుఁ గృతులందుఁ గాకుస్వ♦రము సహస్ర
నామశోభితగోపకృ♦ష్ణా యనంగ
నమరవందిత గోపకృ♦ష్ణా యనంగ.

తా. దీర్ఘాంతములైన సంబోధనయందు వచ్చెడి త్రిమాత్ర ద్విమాత్రలు గలయచ్చులకు ఉభయవిశ్రమంబు చెల్లును. ఇచట మూఁడవ నాలవపాదములందును 'నా' న యనువర్ణములమీఁద నున్న 'ఆ' ఆకారములకు కృష్ణా యనుచో నున్న ఆకారమున కును యతిచెల్లునని సూచింపఁబడియె.

మఱియొకలక్ష్యము :—

క. కాకుస్వరయతు లగు నితఁ
డేకతమున జాననీఁ బవ్వ ♦ళించె ననం బ్ర
శ్నాలిత దీర్ఘ మున నితఁ
డే కవ్వడి రథము గడపె ♦ నిమ్ములఁ ననఁగన్.

ఇచట రెండవపాదమునందు మొదట 'ఇతఁడు + ఏ' అనుచోట ఏవకారాగ్రమందు వచ్చిన ఏకారము కాకుస్వరము గలదిగాన విశ్రమస్థానమునందు పవ్వళించె ననుచోట నిందుగా గమసంధి యగు ఇకారము నిత్యసంధి యైనదిగాన దానితో యతి చెల్లినదియు, నాలవపాదము మొదట (ఇతఁడు + ఎవ్వని) అని సంధివిడఁదీయ, ఎవ్వని యనుపదము మొదటనున్న ఎకారము ప్రశ్నార్థబోధకమై కాకుస్వరమందు విధింపఁబడినదికాన నీ రెండింటికిని యతి చెల్లినది యని యెఱుంగునది.

## 15. రివడి :—

క. సాంసదృకారమ్మును మఱి
రిలవి విరసము నొందు శౌరి ♦ ఋషులకు శశ్వ
త్సులభుఁ డనఁగ నిష్పలుకులు
తలఁపఁగ రీతోడివిరతి ♦ దలకొనునఘుషన్.

ఇకారయుక్తరేఫమునకును ఋకారమునకును యతి సెలంగుట రివడి యనఁబడును. పైపద్యమున రెండవపాదమందు శ్రీరకును ఋకారమునకును యతి చెప్పబడియె నని యెఱుంగునది.

గీ. మును ఋకారము నెలమితో • నొనరినట్లు
చేర దొకట యణా దేశ•కారణమున
పునరకారమున స్వరా • కారవిరతి
క్లృప్తి లేదు శౌరిగుణావ•ళుల కనంగ.

ఇచట నాలవపాదమునందు ఌకార ళికారములకు యతి చెప్పినదని యెఱుంగవలయు.

## 16. అఖండయతి:—

ఉ. మానుగ విశ్రమాక్షరస
 • మన్వితమై స్వర మూదినం దదీ
యానుగుణాక్షరంబె కొని
 • యైనను జెప్పఁగ వచ్చు నీక్రియన్
భానుసహస్రభాసి వృష
 • భాధిపుఁ డన్నటు లర్థయుక్తమై
పూనినచో నఖండయతి
 • పొల్పగు నాదికవిప్రణీతమై.

తా. యతిస్థానంబునందుఁగాని, పాదాదియందుఁగాని యీ రెండింటిలో నెచ్చోటనైన నేహల్లుమీఁద స్వర మూఁదుచున్నదో, రెండవచోట స్వరమూఁదక పోయినను, నాహల్లునకుఁ జెల్లుబడియైన వర్ణమును జెప్పుటయె యఖండయతి యనఁబడును ఇచ్చట మూఁడవపాదము మొదటనున్న 'భాను' అనుపదము మొదటనున్న భకారమునకు విశ్రమస్థానంబునందు వృషభ + అధిపుఁడు అనియుండఁగా, స్వర మూఁది సవర్ణదీర్ఘమయి

నదిగాన నిది యఖండయతి యని యుదాహరణము చూపఁబడినది.

మఱియొక కవిలక్ష్యము:—(భాస్కరరామాయణము).

ఉ. అన్నవు తండ్రిగుట్ల విను ♦ మంతియకా దఁటమీఁద రాజవే
మన్నఁ గొంత లేదు మణి ♦ మండనముఖ్యములైన కానుకల్
మున్నుగ సీతనిచ్చి జన ♦ లోకపతిం గని నన్నుఁ బ్రోవుమీ
సన్నపుఁగార్యము ల్వలదు ♦ సంగరము మే లటుగాక తక్కినన్.

ఈ పద్యమున రెండవపాదమునందు మకారముమీఁద స్వరమూఁదినది. విశ్రమస్థానంబున నున్న మకారముమీఁద స్వరమూఁదకపోయినను, స్వరవ్యంజనంబులకు యతి సెల్లునని లక్ష్యము చూపఁబడియె. మఱియు నీ యతికి వేఱొక్కశబ్దమునందును లక్షణంబు సెప్పుచున్నాఁడు.—

క. పూనుకని యక్షశబ్దము
పై నూహిని శబ్దమున్నఁ ♦ బటువృద్ధి యగున్
దానుగ గుణముం జెల్లును
గాన నఖండంబు స్వరము ♦ దనరుఁ గృతులన్.

తా. అక్షశబ్దమున కూహినీశబ్దము పరంబగునపుడు 'అక్షణాః' అను సూత్రముచే గుణసంజ్ఞగల ఓకారంబు వచ్చును. అప్పుడు 'అక్షోహిణి' అని రూపంబు సిద్ధించును. మఱియు

'అక్షాదూహి న్యామపసంఖ్యానమ్' అనుసూత్రముచే వృద్ధిసంజ్ఞ గల ఔకారము వచ్చుటచే అక్షౌహిణి యనియు రూపాంతరంబు గలదు. కనుక ఓకారమునకుఁ జెల్లువడియగు నచ్చుతోనైనను, ఔకారమునకుఁ జెల్లుబడియగు నచ్చుతోనైనను యతి చెప్పవచ్చును. దీనికిఁగూడ నఖండయతి యని నామాంతరంబు గలదు.

మఱియును నితరగ్రంథములనుండి యుదాహరణము చెప్పఁబడుచున్నది.

కవిజీవ సంజీవము:—

ఆ. లక్షణాన్వితముగ ♦ నక్షశబ్దంబుపై
దనరు నూహి నను ప ♦ దంబు వెలయు
నప్పుడు వృద్ధి సెప్ప ♦ నగు గుణంబును జెల్లు
నాగుణం బఖండ ♦ మై చెలంగు.

ఇదియును స్పష్టార్థముగాన మున్ను వ్రాసినలక్షణంబె యూహించునది.

27. ఉభయ యతి:—(అనంతుని ఛందమునందు)

ఆ. యుష్మ దస్మ దనెడు ♦ నుభయంబునకుఁ బొల్చు
నచ్చు గూడి ద్వివిధ ♦ మయ్యె విరతి
తరమె కృష్ణ యుష్మ ♦ దవతారకథనంబు
లభినుతింప నస్మ ♦ దాదులకును.

తా. యుష్మదస్మచ్ఛబ్దాంతమునం దున్నతకారమునకుఁ జెల్లుబడియైన వ్యంజనముతో నయినను, దానిమీఁదనున్న స్వర

ముతో నయినను యతి చెప్పవచ్చును. దీనికి యుభయయతియని పేరు పైపద్యమున మూడవపాదమునందు మొదటనున్న అకారమునకును యతి చెప్పఁబడియె. ఇది వ్యంజనముతో యతి సెల్లుట కుదాహరణము. నాలవపాదమున మొదటి అకారమునకును విశ్రమస్థానమునందున్న దకారముమీఁది అకారమునకును యతి చెప్పఁబడియు నని యెఱుంగునది.

28. శకంధ్వాది గణయతి:—(పరరూపయతి.)

తే. స్వంతవేదండమార్తాండ॰శబ్దములకు
" యతులు నుభయంబులగు బుధ॰స్వాంతములకు
" నతిసుఖానహుఁ డైనట్టి వే॰దండవరదుఁ
డనఁగ హరి దైత్యతిమిరమా॰ర్తండుఁ డనఁగ.

సంస్కృతభాషయందుఁ బరరూప సంధి యని యొక సంధి గలదు. అయ్యది శకంధ్వాదిగణపఠితశబ్దముల కగు నందురు. అదియెట్లనిన—శక + అంధు=శకంధు వేద + అండ=వేదండ, స్వ + అంత=స్వంత, మార్త + అండ=మార్తండ.

పై నాలుగుశబ్దములనంటి శబ్దములందున్న అకారమునకు విశ్రమస్థానమందున్న యచ్చుతోనైనను హల్లుతోనైనను యతి చెప్పవచ్చును.

పై పద్యమునందు రెండవ, మూఁడవ, నాలవపాదములందు మొదటనున్న య, న, లకు వరుసగా స్వంత, వేదండ, మార్తండశబ్దములలోనున్న అకారమున విశ్రమము చెల్లినది యని లక్ష్యము చూపఁబడినది.

29, 30. యశవర్గ ద్వయ యతి:—

క. యశవర్గ ద్వయమునకును
విశదము దమయక్షరములు • వెలయఁగ వళ్లోఁ
గుశల మగుపదము ధరలో
శశినొదలఁదాల్చు నతేఁడు•హారియను మాడ్కిన్.

తా. య, ర, ల, వ—ఇవి నాలుగును అంతస్థములనఁ బడును. శ, ష, స, హ—ఇవి యూష్మము లనఁబడును. అంతస్థము లొండొంటికివిశ్రమమంనమిత్రములగును. అట్లె శ, ష, స, హాలు దమలోఁ దాము యతియందొప్పును. య, ర, ల, వ లు నాల్గు చెల్లుటకు అంతస్థ యతి యని పేరు. శ, ష, స, హాలు మిత్రము లగుటకు ఊష్మయతి యనిపేరు.

ఈలక్షణపద్యమున నాలవపాదాదినున్న శవర్ణమునకును యతిస్థానముననున్న హాకారమునకును యతిచెల్లెనని లక్ష్యము నెఱుంగవలయును.

విశ్రమప్రకరణము ముగిసెను.

మఱియు నొకరు రావడి యని యొకటి చెప్పియున్నారు. దాని నెవ్వరు నంగీకరింపరైరి. అయినను భారత ప్రయోగము గన్పట్టుటంజేసి, యదియును వ్రాయక తీరదని వ్రాయుచున్నాను.

31. రావడి:—

క. ధారుణి రావడి యనఁదగు
రారేఫకు రేఫరాకు • రహి వడిఁ దనరుఁ
వీరమ్యకీర్తి యగుఁ దా
రారాజు న్నలువ బలుగు•రాలు ననంగన్.

తా. ద్వితీయాంతస్థమైన రేఫమునకును బండిఱాకును యతి చెప్పనచ్చును.

ఈ పద్యమున నాలవపాదము మొదటనున్న 'రా' కును, విశ్రమస్థలముననున్న ఱాకును యతి చెల్లినది యని లక్ష్యము చూపఁబడెను.

మఱియొకలక్ష్యము :—(భారతము).

క. తెంపును బెంపును గదుర ని
లింపులు వెఱగంది చూడ దిక్పుసైన్యములుం
గంపింపఁ దనుబలంబులు
ఱంపిలి బిట్టార్వ సింధురాజుం దాఁకెన్.

ఇచ్చట నాలవపాదము మొదటనున్న ఱకారమునకును, యతిస్థానముననున్న రేఫమునకును యతి చెల్లినది యని మఱియొక్క లక్ష్యము చూపఁబడియె.

ఇఁక షడ్విధప్రాసలక్షణంబు చెప్పుచున్నాఁడు:—

క. ప్రాసంబు లనురు సుకర
ప్రాసానుప్రాసదుష్కరప్రాసాంత్య
ప్రాసద్విప్రాసత్రి
ప్రాసము లన షడ్విధములు ప్రాసము లుర్వీన్.

తా. సుకరప్రాసము, అనుప్రాసము, దుష్కరప్రాసము, అంత్యప్రాసము, ద్విప్రాసము, త్రిప్రాసము, అని ప్రాసము లాఱు తెఱఁగులై యుండు.

## 1. సుకరప్రాసలక్షణము:—

క. పరమోపకార ధరణీ
సుర గురు గురుపూజనరత ♦ సుందరతరుణీ
స్మరనిభ సుకరప్రాస మ
మరఁ జెప్పఁగఁ గృతులఁ జెల్లు ♦[నుల్లయరేచా.]

ఇచ్చటఁ బ్రాసస్థానమునందున్న రేఫను అకారముతోఁ గూడినదిగానఁ బ్రతిపాదమునను నచ్చటచ్చటనునట్టి రేఫమునే ప్రయోగించుటచే నిది సుకరప్రాస మనఁబడియె.

## 2. అనుప్రాసలక్షణము:—

క. విప్రప్రకరముఖప్రీ
తిప్రథమా ప్రమితవాక్ప్రి♦తీ ధీప్రవరా
క్షిప్రణుత సుప్రసన్న య
భిప్రాయప్రవణ మిది సు♦సుప్రియచరితా.

ఈపద్యమున నెల్లయెడలను మఱియుఁ బ్రాసస్థానమునను రేఫయుక్త పకారముం బ్రయోగించుటంజేసి యిది యనుప్రాస మనఁబడియె.

## 3. దుష్కరప్రాసము :—

క. దోఃకీలితమణికటకయు
రఃకలితరమాభిరాను ♦ రాజితసుగుణాం
తఃకరణఖండితతమశ
రఃకందుక యనిన దుష్క♦రప్రాస మగుఁ.

ఇచ్చట ప్రతిపాదమునను ప్రాసస్థానమందున్న పరుష సంజ్ఞగల శకారము విసర్గపూర్వకంబైయున్నది గాన నిది విసర్గప్రాసం బగును.

4. అంత్యప్రాసలక్షణము:—

క. అగణితవిభవస్ఫూర్తీ
నిగమాగమసతతవినుత♦నిర్మలమూర్తీ
జగదభిరక్షణమూర్తీ
యగు నంత్యప్రాస మి ల్లి♦దంచితకీర్తీ.

ఈపద్యమునఁ బ్రతిపాదముకడను 'ర్తీ' యని ఈకారమె చెప్పఁబడి యుండుటచే నిది యంత్యప్రాస మనఁబడియె.

5. ద్విప్రాసము:—

క. కంజన యన భవభీతివి
భంజన శుకశౌనకాది ♦ బహుమునిచేతో
రంజన ద్వంద్వప్రాసమ
నం జను నిప్పాటఁ బల్కి♦నం గృతులందుఁ.

ఇప్పద్యంబునందు 'జన' 'జన' 'జన' 'జను' అనిప్రాసస్థానంబులందు రెండేసి యక్షరములు జంట జంటగాఁ బ్రయోగించియున్నందువలన నిది ద్విప్రాస మనఁబడు.

6. త్రిప్రాసలక్షణము:—

క. తా నవనీతప్రియుఁ డన
దానవనిర్మూలనైక♦తత్పరుఁ డనఁగ

మూని వినీతుండు ననం
ధేను వనఁ గఁ గృతులయందుఁ ద్రిప్రాస మగుఁౘ.

ఇట నాలుగుపాదంబులందును బ్రాసస్థానంబునందు మూఁడేసియక్షరములు గ్రమముగాఁ జెప్పఁబడియున్నందున నిది త్రిప్రాస మనఁబడియె.

ప్రాసలక్షణముసమాప్తము.

పంచభూతబీజాక్షరములఁ జెప్పుచున్నాఁడు.

అందు వాయుబీజాక్షరములు.

క. పరఁగ అ ఆ ఎ ఏ లును
వరుసఁగ చ ట త ప య ష లు ధ్రువంబుగఁ బదియుఁౘ
ధరఁబవనబీజములు [గో
వరవాహన సకలలోకవందితచరణా].

తా. అ. ఆ, ఎ. ఏ, క, చ, ట, త, ప, య, ష యను పది యక్షరములును వాయుబీజాక్షరము లనఁబడును.

2. అగ్నిబీజాక్షరములు:—

క. క్రమమున ఇ ఈ ఐ లును
రమణ ఖ ఛ ఠ థ ఫ రసలును రాజిలుఁ బదియుఁౘ
సమముగను దహనబీజము
లమరఁగఁ దలపోయు [శంబరాంతకహరణా].

తా. ఇ, ఈ, ఐ, ఖ, ఛ, ఠ, థ, ఫ, ర, స యను పది యక్షరములును అగ్నిబీజాక్షరము లనఁబడును.

3. భూబీజాక్షరములు:—

క. మున్నుగ ఉ ఊ ఓ లును
నెన్నఁగ గజడదబలహలు • నీధరఁ బదియుఁ
బన్నుగ భూబీజంబులు
[పన్నగవరశయన బాణ•పన్నగభరణా].

తా. ఉ, ఊ, ఓ, గ, జ, డ, ద, బ, ల, హ యను నీ పదియును భూబీజాక్షరము లనఁబడును.

4. ఉదకబీజాక్షరములు:—

క. ధీరత ఋ ౠ ఔ లును
సారపు ఘఝఢ ధ భ వశలు•సరసఁ బదియుఁ
ఘోరఘబలబీజంబులు
[ఘోరాసురపురవిదార • గోధ్వజకలితా].

తా. ఋ, ౠ, ఔ, ఘ, ఝ, ఢ, ధ, భ, వ, శయను నీపదియును నుదకబీజాక్షరము లనఁబడును.

5. ఆకాశబీజాక్షరములు:—

క. ఌ ౡ అం ఙ ఞ ణ న మ లు
సల్లలితములై వెలుంగు • శక్షలు పదియుం
జెల్లు గగనబీజములని
తెల్లముగా వాసవాది • దివిజస్తుత్యా.

తా. ఌ, ౡ, అం, ఙ, ఞ, ణ, న, మ, శ, క్ష, అను పది యక్షరములును నాకాశబీజాక్షరములని చెప్పఁబడును.

## పంచభూత బీజాక్షరచక్రము.

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ప్రథమము | వాయుబీజములు | అ | ఆ | ఏ | క | చ | ట | త | ప | య | శ |
| ద్వితీయము | అగ్నిబీజములు | ఇ | ఈ | ఐ | ఖ | ఛ | ఠ | థ | ఫ | ర | స |
| తృతీయము | భూబీజములు | ఉ | ఊ | ఓ | గ | జ | డ | ద | బ | ల | హ |
| చతుర్థము | ఉదకబీజములు | ఋ | ౠ | ఔ | ఘ | ఝ | ఢ | ధ | భ | వ | ళ |
| పంచమము | ఆకాశబీజములు | ఌ | ౡ | అం | ఙ | ఞ | ణ | న | మ | శ | క్ష |

పైచక్రములో మొదటి రెండువరుసలు తప్ప తక్కినవి. నిలువుగాఁజదివిన వర్ణక్రమ మేర్పడును. 3. ఏ ఐ, ఓ, ఔ. అం. 4. క, ఖ, గ, ఘ, ఙ. ఇట్లుతక్కినవరుసలలో నెఱుఁగవలయును. కావున ఏకారము మొదలు 'అం' వరకును,క మొదలు, 'క్ష' వఱకును వరుసగా వాయు, అగ్ని, భూ, జల, ఆకాశబీజము లని యెఱుంగవలయును.

క—వాయుబీజము. గ—భూబీజము. ఙ—ఆకాశబీజము.
ఖ.—అగ్నిబీజము. ఘ—జలబీజము.

ఇట్లే తక్కిన వర్గములలోను, యాది పదివర్ణములలోను దెలియవలయును.

పంచభూతబీజాక్షరఫలంబు చెప్పఁబడుచున్నది.

మ. క్షితిబీజంబులు సంపద ల్బొదలఁ బో
షించు న్బయోబీజము

లసితతంబు న్సౌమదం బొనర్చు శిఖిబీ
జంబు ల్మృతుం జేయు మా
యుతబీజంబులు [illegible]
ద్రోయు న్నభోబీజము
ల్పతి నత్యంతదరిద్రుఁ జేయు మిగులం
బద్యాదినొందించినన్.

తా. గ్రంథాదియందు భూబీజాక్షరంబు లిడిన నాకృతి నందినవానికి సకలసంపదల నిచ్చి పోషించును. ఉదకబీజంబు లుంచిన నెల్లప్పుడు సంతసంబొదవును. అగ్నిబీజంబు లైనచోఁ గృతిపతిని జంపును. వాయుబీజము లంకిత మొందినవానికి సర్వదా దుఃఖముఁ గల్గించును. ఆకాశబీజములు దారిద్ర్యం బొదవించును. గానఁ గవీశ్వరుండు దెలిసి ప్రయోగింపవలెను.

అమృతాక్షరవిషమాక్షరములను జెప్పుచున్నాఁడు.

క. అమృతాక్షరములు హ్రస్వము
లమరఁగ దీర్ఘములు విషము లనఁబడు వీనిన్
గ్రమమున కచటతపయశష
సముదయమును దెలిసి నిలుపఁ జనుఁ బద్యాదిన్.

తా. హ్రస్వాక్షరము లమృతాక్షరము లనియు, దీర్ఘాక్షరము లన్నియు విషమాక్షరము లనియుఁ జెప్పఁబడును గాన నేఁ బదివర్ణములలో వీనిక్రమంబుఁ దెలిసికొని గ్రంథము నారంభించు పద్యము మొదటఁ బ్రయోగింపఁదగిన వర్ణములే ప్రయోగింపవలయును.

క. తెలియక ఘోషాక్షరములు
నెలవుగఁ బద్యాదియందు ♦ నిలిపినచోటన్
నలముటఁ బొందియుఁ గృతిపతి
పలుమఱు వెత నొంది దైన్య♦పాటుం జెందున్.

తా. వ్యాకరణమందు గ, ఘ, జ, ఝ, ఙ, ఞ, డ, ఢ, ణ, ద, ధ, న, బ, భ, మ, య, ర, ల, వ—ఈ యక్షరములు ఘోషమని సంజ్ఞగలవి, ఈ యక్షరములను గృత్యాదియందుఁ బ్రయోగించినయెడల వాకృతి నందినవాఁడు రాజ్యభ్రష్టుఁడై దారిద్ర్యమునొంది సకలకష్టము ననుభవించునని తా.

శ్రీకారమునకు ఫలము.

శ్రీకారము గృత్యాదిని
బ్రాకటముగ నున్నఁ జాలు♦బహుదోషములం
బోకార్చి శుభము లొసఁగును
బ్రాకృతముగ నినుము సోఁకు♦పరుసము భంగిన్.

శ్రీకారమునకు శుభదత్వ మెట్లనిన :—శవర్ణ, రేఫ, ఈకారముల సంయోగమువలన 'శ్రీ'యను నక్షరమయ్యెను. శవర్ణ, రేఫలకు చంద్రుఁడును, ఈకారమునకు సూర్యుఁడును గ్రహములుగాన వారిరువురు నొండొరులు చెలిమిగలవారగుటచేతను, ఈకారశవర్ణంబులకు లక్ష్మి యధిదేవత యగుటవలనను, (లక్ష్మీ ప్రదోహుతాశనః = అగ్నిబీజములు గల్గి నిచ్చునవి.) శ్రియమిచ్ఛేద్ధుతాశనాత్ = అగ్ని బీజములవలనఁ గల్గుఁ గోరవలయును) అని యుండుటచేతను, శ్రీకారము సంపత్ప్రదంబని యొప్పుంగునది.

మఱి విషమాక్షరము లెవ్వియనఁగా.

క. ఘోరతర పద్యముఖమున
వేఱుగ నొకచోటు చూచి ♦ వెదకఁగ నేలా
యూరవకడ తానిలిపిన
మాఱమ్మునఁ గ్రుమ్మినట్లు♦మడియు మనుజుఁడుర్.

తా. పద్యముయొక్క మొదటినుండి యాఱవ యక్షరము తకారముగా నుంచి తిట్టినేని ఱొమ్మున బాణము దాఁకిన తెఱంగున వెంటనే చనిపోవును.

మఱియు దానినే చెప్పుచున్నాఁడు.—

క. హాజగడ లివి మూఁడవచో
నిజముగ నిందించి చెప్ప ♦ నీల్గుట యరుదే
భుజగమున కన్న కీడగు
సుజనామరభూజ రేచ ♦ సుగుణసమాజా.

తా. పద్యము మొదటినుండి మూఁడవచోట హా, జ, గ, డ, యను నక్షరములలో నెద్దియయిననుంచి తిట్టినయెడలఁ ద్రాఁచుబాము గఱచినటులఁ జచ్చిపోవును.

మఱియు దీనినే విశేషించి చెప్పుచున్నాఁడు—

క. అకచటతపయశ లెనిమిది
ప్రకటితగిరి ఋతులమూఁటఁ♦బదునొక్కింటర్
వికటముగఁ బెట్టి పద్యము
సుకవులు సత్ప్రభుల కిడ ర♦శుభకర మగుటర్.

తా॥ అ, క, చ, ట, త, ప, య, శ అను నీయెనిమిది యక్షరంబులు పద్యము మూఁడింట, నాలింట, నేడింట, బదు నొక్కంటను బ్రయోగించినఁ జెఱుపుగలుగును గాన సుకవు లటులఁ బ్రయోగించి పద్యములఁ బ్రభువుల కంకితము చేయ రని తా॥.

మఱియు ననంతుండు.

క. పుర శర ధన గిరి రుద్రుల
నరయ న క చ ట త ప లిడుట ♦ యనుచిత మీయ
క్షరములు న ర చ భ జంబులు
పరిహరణీయములు నాదిఁ ♦ బంకజనాభా.

మూఁడింట నైదింట నాలింట నేడింటఁ బదునొక్కొటింటను అ, క, చ, ట, త, ప యను నాఱక్షరములును నిలు పరాదనియుఁ బద్యాదియందు న, ర, చ, భ, జ యను అయి క్షరములు నుండరాదనియు నెఱుంగవలయును.

మఱియు విషమాక్షరములం జెప్పుచున్నాఁడు.—

చ. రసగిరిరుద్రసంఖ్యలను
♦ రాదొనఁగూర్ప నస్వరాదివర్ణముల్
వసుధ హకారముఖ్ క్షరట
♦ వర్ణ చవర్ణభముల్ దలంపఁగా
నసజగరంబు లగ్నునెడ
♦ నై దవచోట హలాదివర్ణముల్
పసి దగఁ జెప్ప నాఱిట ర
♦ సల్ గజముల్ గదియింప వర్జ్యముల్.

అథర్వణఛందము.

క. ఌ ౡ ఋ ౠ ఙ ఛ ఝ ఞ ట ద ధ ణ
దలు నవబణములును రళలు ♦ దగనక్షసలుఁ
నెలకొని పద్యముఖంబున
నిలుపగు సత్కృతులు శాస్త్రనిందితములగుటన్.

తా. అ, ఆ, హా, క్ష, ర, ట, చ, భ, న, జ, స, గ, ర-యను నక్షరంబుల నయిదింటను, ఆఱింటను, ఏడింటను, బదు నొక్కొంటను బ్రయోగింపఁ గాదనియు, అ, స, జ యను నక్షరములు నాలుగవయింటను హలాదిసగ్ణము లైదవయింటను, ర, న, గ, జ యనువర్ణములు లాఱవయింటియందును జెప్పరాదు.

ఌ, ౡ, ఋ, ౠ, ఙ, ఛ, ఝ, ఞ, ట, ద, ధ, ణ, న, వ, బ, ర, ళ, క్ష, స యను నీయక్షరములు పద్యము మొదట సత్కృతులు ప్రయోగింపవు. ఇవి శాస్త్రదూషితంబులుగాన వీనిని బద్యాదియందుఁ బ్రయోగింపరాదని యెఱుంగవలయును.

ఇందున కాదికవిలక్ష్యము.—

చ. హాయ మది సీత పోతవసు
♦ ధాధిపుఁ డారయ రావణుండు ని
శ్చయముగ నేను రాఘవుఁడ
♦ జాహ్నవి వారిధి మాపుఁ డంజనా
ప్రియతనయుండు సింగన వి
♦ భీషణుఁ డాగుడి మెట్ట లంక నా

జయమును బోతరక్కసుని
చావును నేడవనాఁడుచూడుఁడీ.

ఇచ్చట మొదట నాలవయక్షరము తకారంబు పెట్టి తిట్టినాఁడు గావున నావిషమాక్షరప్రయోగంబువలనఁ బోతనాయకుఁడు అనువాఁడు చచ్చెనని లక్ష్యము సూపఁబడియె.

మఱియును.

క. కూరడుగము కాయలు మే
మారంగా నుల్లి బచ్చలల్ల నుడుగ మీ
పే రాముదపా కడిగినఁ
బాలమ్మువ నేసినట్లు పాపఁడు ద్రెళ్లెన్.

ఇచ్చట మొదటిపాదంబునఁ బాలవచోట కకారము పెట్టితిట్టినాఁడు.

మఱియు నింకఁ బ్రయోగవిధిం దెల్పుచున్నాఁడు.

క. తలపోసి గద్యపద్యా
దుల నక్షరగణములకును దొరకొని మైత్రిల్
గలుగఁగఁ జెప్పినహస్తా
మలకముగాఁ దగుఫలంబు మహి నిర్వహకున్.

తా. గ్రంథాదియందు నక్షరములకును గణములకును ఛందశ్శాస్త్రంబునందుఁ జెప్పఁబడిన పొందికలు తెలిసికొని ప్రయోగించినయెడల, కృతినందిన ప్రభువునకును, కృతియిచ్చిన కవీశ్వరునకును శుభఫలంబులు చేతిలోని యుసిరికకాయ వలె సిద్ధంబుగా నుండును.

వర్ణముల కధిపతిగ్రహంబులను జెప్పుచున్నాఁడు.

తే. ఆదులకు రవి కాదుల కవనిజుండు
చాదులకు బుధుఁడును గవి టాదులకును
తాదులకు బృహస్పతి శని పాదులకును
యాదులకు నెల్ల శశియు గ్రహంబు [కృష్ణ.]

తా. అచ్చులు పదునాఱింటికి సూర్యుఁడును, కవర్గమునకు నంగారకుఁడును, చవర్గంబునకు బుధుఁడును, టవర్గమునకు శుక్రుఁడును, తవర్గమునకు బృహస్పతియు, పవర్గమునకు శనియు, య ర ల వ శ ష స హ ళ క్ష యను పదివర్ణంబులకు చంద్రుఁడును నధిపతులయిన గ్రహంబులు.

ఇంక బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులకుఁ బ్రయోగింపఁదగిన వర్ణములను జెప్పుచున్నాఁడు.—

క. వసుధాసురులకు కచటలు
వసుధాపతులకును తపరవలు వైశ్యులకున్
యసహలశషలును శూద్రుల
కసమున ళ క్ష అలు చెప్పనగుఁ బద్యాదిన్.

తా. బ్రాహ్మణులకు క చ ట వర్గలును, రాజులకు త, ప, వర్గలు ర వ లును, వైశ్యులకు య స హ ల శ షలును, శూద్రులకు ళ, క్ష, అ యనువర్ణములును బద్యముల మొదటఁ జెప్పవలయును.

ఇంక నీచాతుర్వర్ణ్యబీజాక్షరములకు సొమ్ములును, వస్త్రంబులును జెప్పుచున్నాఁడు.

సీ. కాఁగ త్రివర్గవ♦ర్ణాళికి మౌక్తిక
వజ్రభూషలుఁ దెల్పు♦వస్త్రములును
పప్పప్రపలకుఁ ♦ దెలియుపాయసంబు
దోషవులు వలువలు ♦ దోవరుచాయ
యలశషసహాబీజ♦ములకగుఁ బుష్యరా
గాభరణములు పీ♦తాంబరములు
శక్షుఅంబులకు నీ♦లాలసొమ్ములు గారు
కొను నీలివన్నెల♦కోకలెల్ల
తే. వరుస నివి నాల్గు తెఱఁగుల♦వర్ణములకు
ననుభవించెను ద్రవ్యము♦ల్నాన్న శాలు
నాజ్యమును గమ్మ తేనియ♦మాసనంబు
దీనిఁ దెలియక సత్కవి♦ దానె జగతి.

తా. బ్రాహ్మణులకుఁ బ్రయోగింపఁదగిన వర్ణములగు కచ టవర్గములకు ముత్యములు వజ్రములు చేర్చినసొమ్ములును, తెల్లనివస్త్రములును, నెయ్యిపప్పుతో నన్నముఁ జేసిన భక్ష్యము భోజన ద్రవ్యము నగు. క్షత్రియులకుఁ బ్రయోగింపఁదగిన తథ పవర్గ రేఫ, వకారములకు కెంపులుచెక్కిన సొమ్ములును, నెఱ్ఱని బట్టలును, నేయి భోజనద్రవ్యమునై యుండును. మఱియును వైశ్య ప్రయోగయోగ్యమైన యలశషసహ వర్ణములకు పుష్య రాగంబులు దాఁపిన సొమ్ములును, పచ్చని బట్టలును, మంచి

తేని భోజనపదార్థమునగును. మఱియు శూద్రప్రయోగయోగ్యములైన, శ, క్ష, అవర్ణములకు నీలాలసొమ్ములును, నీలిబట్టలును, పచ్చికభోజనమున్నునై యుండునని యెఱుంగునది.

అక్షరజాతీయులక్షణముం జెప్పుచున్నాఁడు.

క. కాదులు విప్రక్షత్రియులు
భూదేవతలు తపవర్గములు రవలును ధా
త్రీపతులును యలశషసహ
లాదట వైశ్యులును శక్ష ళాంబులు శూద్రుల్.

తా. కవర్గ, చవర్గ, టవర్గములలోని యక్షరంబులు బ్రహ్మబీజములు, తవర్గ, పవర్గములలోనియక్షరములు రేఫవకారంబులును క్షత్రియబీజములు. య, ల, శ; ష, స, హ వర్ణములు వైశ్యబీజంబులు. శ, క్ష, అ కారములు శూద్రబీజములు.

గణోత్పత్తిక్రమంబును, తదని దేవతా నక్షత్రగ్రహారాశిఫలంబులును జెప్పుచున్నాఁడు.

క. అది గానఁ దంప్రతిపొందకుల
కొదవను వైరం బటంచు నొనరఁగ సుకవుల్
గొదకక బంధురగణములఁ
గదియింతురు రసలు దక్కఁ గావ్యముఖములన్.

తా. రగణమువలన సగణము పుట్టినదైనను నీరెండుగణములను దక్కఁ దక్కినగణములకు జనకజన్యభావంబును నన్యోన్యమైత్రియుం గలదు గాన వానిని సుకవు లొక్కటితో నొక్కటి చేర్చుదురు.

ఈగణములయొక్క ఫలాఫలంబులం దెల్పుచున్నాఁడు.

ఉ. నవ్యసుఖప్రదాయి భగ
ణంబు జకారము రుక్ప్రదం బగుఁ
ద్రవ్యముసేయు నాలయక
రంబు సకారము మా సుఖంబు యా
దివ్యసువర్ణకారి వెతఁ
దెచ్చును రేఫవిభూతి నిచ్చుఁ దాఁ
గావ్యములందు నాది నిడఁ
గం దగు భర్తకు నంబుజోదరా.

భగణము సుఖమునిచ్చును. జగణము రోగమునిచ్చును. నగణము ధనమునిచ్చును. సగణము నాశముగావించు. మగణము శుభప్రదంబు. యగణము బంగారమునిచ్చును. రగణము సుఖప్రదంబు. తగణము కష్టమిచ్చును గాన వీని నెఱింగి సత్కవులు గ్రంథాదియందు శుభప్రదములైనగణములను బ్రయోగింపవలయును.

గ్రంథారంభపద్యము మొదటఁ బ్రయోగింపఁదగిన రెండుగణముల యొక్క సాన్నిధ్య ఫలమును జెప్పుచున్నాఁడు.

క. చందనతరుసంగతి పిచు
మందంబులు పరిమళించుమాడ్కి నినందా
నందకరమైనగణములఁ
బొందును దుష్టగణవర్ణములు ప్రచయ మెసఁగన్.

తా. పద్యాదియందున్న గణము శుభప్రదమయినచో దాని చెంగటనున్న గణము దుష్టగణమయినను మంచిగంధపు చెట్టు దాపుననున్న వేపచెట్టును బరిమళించునటుల మంచిదే యగును.

మఱియును.

ఆ. పరుసవేదితోడఁ ♦ బెరసినలోహంబు
జాతరూపమైన ♦ చందముననుసారమైనగణము ♦ సంగతిఁ దనకీడు
మూని దుష్టగణము ♦ మంచిదగును.

తా. పరుసవేదిని దాఁకిన యినుము బంగారమగునట్లుగ మంచిగణముయొక్క సాన్నిధ్యమువలన దుష్టగణంబును శుభంబునిచ్చును.

నగణమున కతిశయఫలంబుఁ జెప్పుచున్నాఁడు.

తే. పర్వతములందు మేరువు ♦ ఖ్యాతి యగుచు
సర్వసురులందు శంకరు ♦ నాద్యు డగుచు
నరయ మృగములయందు సిం ♦ హంబుకరణి
గణములందెల్ల నగణంబు ♦ గరిమఁ గాంచు.

తా. పర్వతములలో మేరుపర్వతంబువలెను దేవతలలో నీశ్వరునివలెను మృగంబులలోపల సింహంబువలెను గణంబులలోపల నగణము శ్రేష్ఠము.

గణప్రయోగంబునకు యోగ్యములైన జాములను జెప్పుచున్నాఁడు—

సీ. జయవిజయంబులు ♦ శంఖ మహాశంఖ
ములు సనఁ బగటిజా ♦ ల్వేలయుచుండు

రాత్రిజాల్ క్రమవి ♦ రామసుప్తప్రసు
 ప్తంబులు ననఁగను ♦ దనరుచుండు
నీయెనిమిదిజాలఁ ♦ బొలయుక మగణాది
 గా జనించు గణాష్ట ♦ కంబువరుస
నేజామునను గావ్యఁ ♦ దెలుపుతోఁ గబ్బంబు
 విరచింపఁ గారు న ♦ వ్వేళయందు
తే. సుశుభం బయిన గణ ♦ ప్రయోగమునకు
 శుద్ధిగాఁ గూర్చునదియు వి ♦ జ్ఞోపపత్తిఁగ
 గణము లూహించి కూర్చు బి ♦ కారికుకవి
 పద్య మొల్లఁడు బ్రతు కాస ♦ పడఁడు వాఁడు.

తా. పగటి నాలుగుజాములకు వరుసగా జయము, విజయము, శంఖము, మహాశంఖము ననియు, రాత్రి నాలుగుజాములకును రామము, విరామము, సుప్తము, ప్రసుప్తము ననియును పేళ్లు. మ, య, ర, స, త, జ, భ, న యను నెనిమిదిగణములను క్రమముగా నెనిమిదిజాములయందుఁ గవిత్వారంభము చేయవలయును. అట్లుగాక యవి విజ్ఞోడుపడినట్లు కూర్చు కుకవికిఁ బ్రాణహాని గలుగును.

గణప్రయోగవారములఁ జెప్పుచున్నాఁడు.—

తే. శుక్ర గురు బుధ వారముల్ ♦ సౌఖ్యసేయు
 సోమవారంబు సంపదల్ ♦ సొరిది నిచ్చు
 శనియు మంగళవారముల్ ♦ చావు దెచ్చు
 భానువారంబు సంగరం ♦ బమరఁ జేయు.

తా. శుక్ర, గురు, బుధవారంబులందుఁ గృతి యారంభిం
చిన గ్రంథము మనోహరంబయియుండును. సోమవారము నా
రంభించిన సంపద గలుగును. శనివారమున, మంగళవారమున
నారంభించిన మరణము సంభవించును. ఆదివారమున నైనచోఁ
గలహము సంభవించును.

గణములయొక్క జాతిని జెప్పుచున్నాఁడు.

క. లలితయతలు విప్రకులం
బులు రజ లవనీశకులజ ♦ ములు భనలు న్వై
ట్కులజులు మగణము నాలవ
కులజము సగణంబు హీన ♦ కులజం బమరన్.

తా. యగణ, తగణములు బ్రాహ్మణకులంబునను, రగణ, జగ
ణములు క్షత్రియకులంబునను, భగణ నగణములు వైశ్యకులంబు
నను, మగణము శూద్రకులంబునను, సగణముచండాలకులంబు
నను బుట్టినవి.

జాతిగణప్రయోగలక్షణంబు జెప్పుచున్నాఁడు.

క. నాయకుఁ డేకులమైనను
బాయక తత్కులగణంబు ♦ పద్యము మొదటన్
ధీయుక్తి నిడఁగ మేలగు
నేయెడ సంకరము లిడఁగ ♦ నెగ్గగుఁ బతికిన్.

తా. కృతినాయకుఁ డేకులంబునఁ బుట్టినవాఁడో, వానికులం
బునకుఁ దగినగణంబునే గ్రంథములోని మొదటి పద్యము మొ
దటనుంచిన మేలుగలుగును. అట్లుగాక యొకకులమువానికి

మత్రియొక కులంబునఁ బుట్టిన గణంబును గ్రంథాదియందుం చినఁ గీడు గలుగును.

మఱియును.

తే. ఆదిపద్యాది శ్రీకార ♦ మైన దేవ
వాచకం బైననప్పుడు ♦ వఱలుసిరులు
నాదిపద్యాది మూఁడుగ♦ణాక్షరములు
చూడవలెఁ గాని యన్నియుఁ ♦ జూడవలదు.

తా. గ్రంథారంభపద్యము మొదట శ్రీకారమునుంచినను దేవతావాచకం బయినశబ్దము నుంచినను సంపదలు గలుగును. మఱియు గ్రంథాదిపద్యమున మూఁడుగణములవఱకు గుణదోషంబులఁ జర్చింపవలెను గాని యావల నక్కఱలేదని యెఱుంగునది.

మ, య, ర, స, త, జ, భ, న యను నెనిమిది గణంబులకును అధిపత్య గ్రహవర్ణ నక్షత్ర రాశి స్వభావాభిజనగణమ్యైత్రిరసఫలంబులను జెప్పుచున్నాఁడు.

1. మగణమునకు.

మ. ధరదైవంబు గ్రహంబు సౌమ్యుఁడు హరి
♦ ద్వర్ణంబు సత్కాంతియూ
సురమూహింప గణంబు జాతి తిలకిం
♦ చుఁ శూద్రజాయోని నా
హారిణం బుజ్జ్వలతార జ్యేష్ఠ రస ము
♦ద్యద్రౌద్ర మారాశి తే

లు రుభ ద్రంబు ఫలంబు నా మగణ మిం
♦పొందుఁ బుధస్తుత్యమై.

తా. మగణమునకు భూమి అధిపతి, బుధుఁడు గ్రహము, చ్చునివన్నె మంచికాంతి. రాక్షసగణము. శూద్ర జాతి. జ్యేష్ఠ క్షత్రము. వృశ్చిక రాశి. రౌద్ర మగుగసముఫలంబుమిక్కిలి మేలు

2. యగణమునకు.

ం. అలరుం దైవము వార్ధి బ్రాహ్మము కులం
♦బావన్నె తె ల్పర్థమా
ఫలమా యోని ప్లవంగమా గణము నె
♦ప్పుఁ మానవం బాగ్రహం
బలశుక్రుండు రసంబు దాఁ గరుణ
♦ పూర్వాషాఢ నక్షత్ర మి
మ్ములఁ గోదండము రాశి యీయగణ మొ
♦ప్పు న్గోపిద స్తుత్యమై.

తా. యగణమునకుసముద్రముఅధిదైవము. బ్రాహ్మణకులము. ల్లనివన్నె. ఫలమర్థము. వానరజాతి. మనుష్యగణము. శుక్ర గ్రహము. కరుణరసము. నక్షత్రముపూర్వాషాఢ. ధనుస్సు యని యెఱుంగ వలయును.

3. రగణమునకు.

ం. అనఘుం డీశుఁడు రాశి మేషము గ్రహం
♦బాభౌముఁ డత్తార సం

ప్రణాతి స్మృత్తిక దైత్యమా గణమువై
♦రాజ్యాంబు వంశంబు మే
ఓ సటిక్ష ఫలంబు భలము శృం
♦గాగంబు సత్కాంతి కో
కనదాచ్ఛచ్ఛవిసుంచు నారగణ మె
♦క్కాలంబు నొప్పార భువిన్.

తా. రగణమున కగ్ని అధిపతి. మేషము రాశి. గ్రహ మంగారకుఁడు. నక్షత్రముకృత్తిక. క్షత్రియగణము. యోని ఫలము. శృంగారము రసము. ఎఱ్ఱకలువలవంటికాంతి. ఫలము భీతి యని యెఱుంగవలయును.

4. సగణమునకు.

చ. అనిలుఁ డధీశుఁడుర్ గువల
♦యంబుల కాంతి కులంబు హీనముర్
గని గ్రహ మా శనైశ్చరుఁడు
♦కాలఁగ నల్పగువన్నె తొలి సూఁ
దనరఁ గరాళస్వాతితన
♦తార ఫలంబు క్షయంబు దానవం
బొనర గణంబు నమ్మలవ
♦యోని యగుర్ సగణంబు నీశ్వరా.

తా. సగణమునకు వాయు వధిపతి. నల్లకలువలవంటికాంతి. చండాలకులంబు. శనిగ్రహంబు. నలుపువన్నె. తులారాశి. రూపు భయంకరము. నక్షత్రము స్వాతి. ఫలము నాశము. అసగణము. యోని మలవ యని యెఱుంగవలయు.

తగణమునకు.

మ. అమరు న్మిన్నధిదైవముం గులము బ్రా
 ‌‌ ‌‌ ‌‌ ‌‌ హ్మం బాగణం బెన్న దై
వము జీవుండు గ్రహంబు నల్పు రుచి యై
 ‌‌ ‌‌ ‌‌ ‌‌ శ్వర్యంబు లబ్ధంబు మే
షము దా యోని రసంబు శాంత మలన
 ‌‌ ‌‌ ‌‌ ‌‌ క్షత్రంబు పుష్యంబు రా
శి మహిం గర్కటకంబు నా తగణ ము
 ‌‌ ‌‌ ‌‌ ‌‌ త్సేకం బగుఁ జెల్వనై.

తా. తగణమున కాకం బధిదైవము. బ్రాహ్మణకులము. దేవతాగణము. శుక్రుండు గ్రహము. నల్లని కాంతి. ఫలమైశ్వర్యము. మేషము యోని. శాంతి రసము. పుష్యమి నక్షత్రము. కటకము రాశి యని యెఱుంగునది.

6. జగణమునకు.

మ. అరుణుం డేలిక చాయ రక్తిమ రసం
 ‌‌ ‌‌ ‌‌ ‌‌ బవ్వీర మా యన్వయుం
బురుషై రాజ్యము రాశి సింహము గ్రహం
 ‌‌ ‌‌ ‌‌ ‌‌ బుష్ణాంశుఁ డత్తార యు
త్తర రోగంబు ఫలంబు యోని యురవాం
 ‌‌ ‌‌ ‌‌ ‌‌ దఁ ధేను వమ్మానవం
బరుదారంగ గణంబు నా జగణ మిం
 ‌‌ ‌‌ ‌‌ ‌‌ పారుఁ జగత్సేవ్యమై.

తా. జగణమున కరుణుఁడధిపతి. ఎఱ్ఱనిచాయ. వీరరసము. క్షత్రియవంశము. సింహము రాశి. సూర్యుఁడు గ్రహము. ఉత్తరనక్షత్రము. రోగము ఫలము. గోయోని. మనుష్య గణము నని యెఱుంగునది.

## 7. భగణమునకు.

ఉ. చంద్రుఁ డధీశ్వరుం డమృత
 సారము కాంతియు విట్కులంబురా
చంద్రుఁడు దద్గ్రహం బశని
 చాయయుఁ దెల్పువృషంబురాశిభో
గీంద్రము యోని దేవగణ
 మీప్సితసౌఖ్యము దత్ఫలంబు చం
జంద్రుని చాయమైఁ దనరుఁ
 జంద్రధరా! భగణంబు నుర్వరన్.

తా. భగణమునకు చంద్రుఁడధిపతి, తెల్లనికాంతి, వైశ్య కులము, చంద్రుఁడు గ్రహము, వృషభరాశి, సర్పయోని, దేవతాగణము, ఫలము సౌఖ్యము, వెన్నెలవంటి చాయయు నని తెలియునది.

## 8. నగణమునకుఁ

మ. పరమాత్ముం డధినాయకుండు జయసౌ
 భాగ్యైకసామ్రాజ్యపూ
జ్యరమాసంతతు లీవి లబ్ధము నిజో
 పాంతస్థదుష్టాక్షరో

త్కరదోషాఢ్యగుణాఘధూర్తగణము
◆ల్ఖండించుట ల్కీలమె
వ్వరికిం గాదన రాము నాగణము న
◆వ్యాజస్థితిం బొల్పగుణ్.

తా. నగణమునకు శ్రీమహావిష్ణు వధిదేవత. జయమును సంపదను సామ్రాజ్యమును నొసంగుటయే దీనికిఫలము. దీనిచెంగట నున్న దుష్టగణముల దుష్టవర్ణముల దోషములఁ బోకార్చుటయె యీనగణముయొక్క స్వభావము గాన నీనగణమునకు నక్షత్ర రాశియోనికూటములు సెప్ప నక్కఱలేదనికవి యభిప్రాయము.

గణముల కధిపతులను జెప్పుచున్నాఁడు.

చ. భగణము నేలుఁ జందురుఁడు
◆భానుఁడు దా జగణంబు నేలు నా
నగణము నేలు నిర్జరగ
◆ణంబు సమీరణుఁ డేలు చెప్పుదు
స్సగణము నుర్వియేలు మగ
◆ణంబునొగిం యగణంబుఁ దోయము
ల్రగణము పావకుండు తగ
◆ణంబు నభంబునునేలుఁ గేశవా.

తా. భగణమునకుఁ జంద్రుఁడును, జగణమునకు సూర్యుండును, నగణమునకు వేల్పులును, సగణమునకు వాయువును, మగణమునకు భూమియు, యగణమునకు జలమును, రగణమునకు అగ్నియు, తగణమున కాకాశంబును నధిపతులు.

పుం స్త్రీ నపుంసకగణములఁ జెప్పుచున్నాఁడు.

క. మగణము నగణము పురుషులు
జగణ రగణ సగణములు నిజంబుగ నింతుల్
యగణము తగణము భగణ
మ్మగు క్లీబము లుత్తమాధమఫలములుభువిన్.

తా. మగణము, నగణమును పురుషులు. జగణము, రగణము, సగణము స్త్రీలు. యగణము, తగణము, భగణము నపుంసకములు. వీనికి వరుసగా నుత్తమ, మధ్యమ, నీచఫలంబులు గలుగును.

స్త్రీ, పుం, నపుంసకలింగగణములకు ఫలము.

క. సంగతిగఁ గృతుల స్త్రీపుం
లింగపుశబ్దములు నిల్ప లెస్సగుఁ బతికిన్
వెంగలి బుద్ధి నపుంసక
లింగం బగు శబ్దమిడిన లేవు సుఖంబుల్.

తా. గ్రంథములందు స్త్రీగణములగు జగణ, రగణ, సగణములను పురుషగణములగు మగణ, నగణములతోఁ జేర్చిన మేలయ్యెడు. అటుగాక మూఢబుద్ధిగల కుకవి స్త్రీనపుంసక గణములను, పుంనపుంసక గణములను జేర్చిన మేలు గలుగదు.

మగణమును దుష్టగణంబులతోఁ జేర్పరాదు.

క. మగణం బెప్పుడు శుభకర
మగు నైననుఁ గూరగణమునది డాసినచోఁ

దెగి చంపు బుధుఁడు క్రూరుం
డగు గ్రహముంగదిసి క్రూరుఁడై చనుమాడ్కిన్.

తా. మగణంబెల్లప్పుడు శుభప్రదమైనను, కృత్యాదియందు మగణము నిల్పి దానితోడ దుష్టగణంబు నిల్పినయెడల, "బుధః పాపయుతః పాపః" బుధుఁడు దాను సౌమ్యగ్రహమైనను పాపులగు రాహువు మున్నగు గ్రహంబుల సంబంధమువలనఁ బాపుఁడగునట్లు దుష్టగణసాంగత్యమువలన శుభప్రదమైన మగణము గూడ దుష్టమగును.

మగణమున కతిశయఫలంబుఁ జెప్పుచున్నాఁడు:—

క. మగణంబు పద్యముఖమున
నగణేతముగఁ గూర్చి చెప్పనగుఁ గృతియొండెన్
దగపద్య మొండెఁ గర్తకు
నగణేతముగ నొసఁగు నాయురైశ్వర్యంబుల్.

తా. మొదట మగణమును బ్రయోగించి యొకగ్రంథమైనను, తుదకొక పద్యమునైనను జెప్పినయెడల నట్టి కవికి దీర్ఘాయువును, సకల సంపదలును, గలుగును.

మఱియు నామగణమునే వర్ణించుచున్నాఁడు.

క. జగతిని గణముల కెల్లను
మగణముగారణముగాన మగణము గదియన్
నిగిడించినగణ మెల్లను
దగ శుభ మొనరించుఁ గీడు దగులదు దానన్.

తా. గణంబులన్నింటికి మగణము కారణము గాన దాని చేరువనున్నగణములు దుష్టములైనను శుభఫలంబునే యొసఁగును.

సగణంబుతోఁ గూడినగ్రంథాదియందలి గణములఫలము చెప్పుచున్నాఁడు.

క. రసలం జెప్పిన మేలగు
మసలం జేర్చినను గర్త మండల మేలున్.

తా. శార్దూలవృత్తమునకు మ, స, జ, త, త. గయని లక్షణముగాన సగణముతో మగణముచేరివచ్చుచున్నదిగాన గ్రంథాదియందు శార్దూలవృత్తంబుఁ జెప్పె నేనిఁ గృతినందిన ప్రభువు మండలాధిపతియగు, ఇట్లె రగణమును సగణముతోఁ జేర్చి చెప్పినను శుభంబుగలుగును.

యగణముతోఁ గూడినకృత్యాది పద్యగణములకు వేఱు వేఱుగా ఫలంబుఁ జెప్పుచున్నాఁడు.

క. సయలన్ జెప్పినశుభమగు
జయలన్ జెప్పినను బలికి జయకీర్తులగున్
రయలన్ జెప్పిన నెంతయుఁ [చున్.
బ్రియ మగు మఱి మయలఁ జెప్పఁ బెంపొనరిం

తా. సగణయగణములనుగూర్చి చెప్పిన శుభమును, జగణ, యగణములఁగూడఁజెప్పిన జయమును, గీర్తియు, రగణ, యగణములఁ గూడఁజెప్పినఁ గోరిక లనుకూలపడుటయు, మగణ, యగణములను గూడఁ జెప్పిన నభివృద్ధియుఁ గలుగును.

మఱియొక్క ఫలంబును జెప్పుచున్నాఁడు.

క. సభ చెప్పిన విభవంబగు
రభసంబును జెప్పఁ జేటు♦రయమున వచ్చున్
శుభ మగు మయలం జెప్పిన
నుభయము వర్ధిల్లు నందు♦రుభయము చెప్పన్.

తా. సగణ భగణములం గూడఁ జేర్చిన సంపద గలుగును. రగణ,భగణములం జేర్చినఁ జేటువాటిల్లును.మగణయగణములఁ జేర్చిన కవికిని,నంకితము నొందినవానికిని వంశాభివృద్ధి గలుగును.

వేఱొండు ఫలమును జెప్పుచున్నాఁడు.

ఆ. సగణ మగణములు వొ♦సంగిన విభవంబు
ర భ సగణము లెనయఁ ♦ బ్రబలుఁ గీడు
రగణ యగణయుతము♦రాజ్యప్రదం బగు
భయము లిరువురకును ♦ భయము లిడను.

తా. సగణ, మగణములు సంపదఁ దెచ్చును. రగణ, భగణ, సగణములఁ జేర్చిన హాని కలుగును. రగణ, యగణములు రాజ్యము గలిగించును. భగణ, యగణములు చేర్చినఁ గృతిపతికిని, కవికిని భయము వాటిల్లును.

మఱియొకఫలమును జెప్పుచున్నాఁడు.

క. మునులోని పద్యముఖమున
ననిలగణం బిడిన నాయు♦రారోగ్యములు

ద్గానసాగు దానిముందట
ననలగణం బిడినఁ బతికి నలజడ సేయుఌ.

తా. గ్రంథాదియందలిపద్యము మొదట సగణంబు చెప్పినఁ గృతినందినవానికి దీర్ఘాయువు, సంపదలును గలుగును. దానితర్వాత రగణమును జేర్చినేనిఁ గృతిపతికి దుఃఖము నిచ్చును.

క. తగణంబు దొలుతఁ బిమ్మట
భగణంబును గదియ నిల్చి పద్యము హృద్యం
బుగ రచియించినకర్తకు
నగణేతముగ నొసఁగు నాయు రైశ్వర్యంబుల్.

తా. కృత్యాదిపద్యము మొదట తగణమును, దానికిఁ బిదప భగణమును నుంచి పద్యము చెప్పిన కవీశ్వరునికిఁ జిరంజీవిత్వముఁ గల్మియుఁ గల్గును.

తగణముయొక్క మహిమను దెలుపుచున్నాఁడు.

క. తగణంబున కధిదైవము
గగనం బది శూన్య మనుచుఁ గా దని పలుకన్
దగ దది మిక్కిలి మంచిది
గగనం బొగి నిత్యవిభవుఁ గాఁ జేయు నిలన్.

తా. తగణమునకు నధిదేవత యగునాకాశంబు శూన్యముగాన ఫలంబులే దని తలంపరాదు. అదియె మిక్కిలి సంపద నిచ్చును.

### జగణమహిమను వర్ణించుచున్నాఁడు.

క. అవివేకులు జగణంబును
భువిఁ గీడుం జేయు ననుచుఁ ♦ బోనాడుదు రీ
కవివరులకు శ్రద్ధాఢ్యము
వివరింపఁగ మేలు దీప్తి ♦ వివరము గాఁగన్.

క. తగణంబుఁ గదిసి చంపును
రగణముతోఁ గదిసి ఘోర♦రణ మొనరించున్
భగణ మిఁక నొకవిచిత్రము
మగణముతోఁ గూడఁ గాల♦మానము పతికిన్.

తా. జగణము హానిచేయునని కొందఱు మూఢులు చెప్పుదురుగాని యది తప్పక మేలుసేయును. మఱియు జగణముతోడ తగణముఁ జేర్చినఁ గృతిపతికి మరణము గలుగును. మొదటజగణమును, వెంబడి తగణమును జెప్పినేని యుద్ధము సంభవించును. మొదట భగణమును దానివెంబడి మగణమును జెప్పిన యెడలఁ గృతినందినవానికి మరణము తప్పక సంభవించును.

### నగణసంయోగమునకు ఫలంబుఁ జెప్పుచున్నాఁడు.

క. ఏగణముఁ గదియనగణం
బాగణము సమస్తమంగ♦ళావాప్తంబై
రాగిల్లు నినుము పరుసము
యోగంబై పసిఁడి వన్నె ♦ నూనినభంగిన్.

తా. నగణ మేగణముతోఁగలసినను పరుసవేదితోఁ దాఁకింపఁబడినయినుము బంగారమగునట్లు రెండవగణముయొక్క దోషముపోయి రెండుగణములును శుభప్రదంబులగును.

తే. మొదల సంయుక్తవర్ణంబు • గదిసెనేని
మడవ కారెంటికిని గ్రహ•మైత్రి వలయు
నిది విచారింపఁడేనిఁ గృ•తీశ్వరుండు
పిడుగు మొత్తినగతిఁ గూలు•బిట్టు మిట్టు.

తా. గ్రంథాదియందలిపద్యముల మొదటిది సంయుక్తవర్ణంబయ్యేనేని యారెంటికి గ్రహమైత్రి యుండవలయు. అట్లు లేదయ్యేనేనిఁ గృతిపతి నెత్తినఁ బిడుగు పడి చచ్చినట్లు వేగముగఁ జచ్చి పోవును.

కృతిపతికిని గవీశ్వరునకును నక్షరములపొందిక.

క. పొం దెఱిఁగి యానుకూల్యము
నొందఁగాఁ గూర్చి తగఁ బ్ర•యోగించి కృతుల్
సందర్భించు గణాక్షర
బృందం బిరువురకుఁ జాలఁ • బ్రీతి యొనర్చున్.

తా. గ్రహమైత్రిగణమైత్రి రాజభృత్యావర్ణములు దెలిసి కవిత్వంబు సెప్పినయెడల, కృతిపతికిని గవికిని సకలైశ్వర్యసంపదలు గల్గును.

ఆ. చంద్రసూర్యవహ్ని • చక్షుఁ డౌరుద్రుని
మూఁడుకన్నులందు•మూఁడుగుణపు

లుదయ మయ్యె నవియె ♦ యొప్పారె మగణమై
యందు స ప్తగణము లమరఁ బుట్టె

తా. ఈశ్వరునికి సూర్యుఁడు, చంద్రుఁడు అగ్ని యను మూఁడు నేత్రములు గలవు. ఈమూఁడునేత్రములవలన మూఁడు గురువులు పుట్టి మగణ మని నామంబు నొందె. ఆమగణమునుండి తక్కినయేడుగణములు పుట్టినవి.

గణములపుట్టుకం దెల్పుచున్నాఁడు.

క. ఒనరఁగ మ య ర స త జ భ న
లన నీవెనిమిదిగణముల ♦ నతిసత్కృపతో
నెనసినమతిఁ బింగళునకు
మనసిజమథనుండు దాఁ గ్ర ♦ మంబునఁ దెల్పెన్.

క. మగణమువలనన్ యగణము
యగణమువలనన్ జనించె ♦ నారగణంబున్
రగణమువలన స్సగణము
సగణంబును తగణమునకు ♦ జనకం బయ్యెన్.

క. తావలన జగణ మయ్యెన్
జావలనను భగణ మయ్యె ♦ సరసంబుగ నా
భావలన నగణ మయ్యెను
భావింపఁగ జన్యజనక ♦ భావము గాఁగన్.

క. అది గానఁ దండ్రికొడుకుల
కొదవదు వైరం బటంచు ♦ నొనరఁగ సుకవుల్

గాదకక బంధురగణములఁ
గదియింతురు రసలు దక్కఁ గావ్యముఖములన్.

తా. గణము లెనిమిది యని పరమేశ్వరుఁడు పింగళునకు దయతో నుపదేశించెను. మగణమువలన యగణము, యగణమువలన రగణము, రగణమువలన సగణము, సగణమువలన తగణము, తగణమువలనజగణము, జగణమువలన భగణము, భగణమువలన నగణమును బుట్టినవి. వానిలో రగణమువలన సగణము పుట్టినను, నవి రెండుఁ దక్కఁ దక్కినగణములకు జన్యజనకభావంబుచే నన్యోన్యమైత్త్రి గల దని యెఱుంగునది.

మగణప్రభావంబుఁ జెప్పుచున్నాఁడు.

క. మించినపరుసము లోహముఁ
గాంచనముగఁ జేయునట్టి కైవడి గణముల్
మంచివి గానివి యైనను
మంచివి యై వెలయఁ జేయు మగణముపతికిన్.

తా. పద్యాదియందు మగణమునుంచిన రెండవగణమెట్టిదుష్టగణ మైనను మగణముదాపున నుండుటచేఁ గృతి నందినవానికి సకలసంపదలనిచ్చును.

తగణప్రభావము.

క. అగణితపదసంపత్కర
మగుఁ దగణము దానిపజ్జ నమరినగణముల్
వెగటుగుణంబులు మానుఁ జె
లఁగుచున్ సౌఖ్యంబు లొసఁగు లలితచరిత్రా!.

తా. తగణముతోఁ గూడినగణము దుష్టమయినను శుభ ఫలంబు నొసంగును.

మఱియు విశేషఫలము.

క. భగణంబు సకలశుభములఁ
బొగ డొందఁగఁ జేయుదానిఁ♦బొందినగణముల్
మిగుల శుభంబుల నొసఁగును
యగణంబు సువర్ణకారి ♦ యగుఁ బద్యాదిన్.

తా. పద్యాదియందు భగణ ముండెనేని దానిదాపున నున్న గణములు చెడ్డ వైనను, శుభఫలంబు నొసంగును. అట్లె పద్యాది యందు యగణ మున్నను మేలు గలుగును.

క. రగణంబును జగణంబును
జగణముఁ బద్యాది నిల్పఁ♦జన దెవ్వరికిన్
దగ దనక యవియె నిల్పిన
మిగులం బతి కవయుఁ జెడఁగు ♦ మేదినిలోనన్.

తా. రగణ, సగణ, జగణములఁ బద్యాదిని నిల్పరాదు. అట్లు గాక కవి వానిని నిల్పెనేనిఁ గృతినొందినవానికిఁ దప్పక హాని కలుగును.

క. యగణముతో యగణంబును
జగణముతో జగణములును ♦ సగణముతోడన్
సగణంబును రగణముతో
రగణంబును గూర్చి చెప్ప♦రా దెయ్యెడలన్.

తా. యగణ, జగణ, సగణ, రగణములలో నెద్దియైనను మొదటఁ జెప్పి రెండవగణంబు నదియె చెప్పరాదు.

రాజులకు యోగ్యము లైనగణములు.

క. రాజులకు జగణరగణము
లోజం గీలించి సుకవి ♦ యొసఁగినపద్యం
బౌజిని జయ మీఁ జాలును
తేజీ లేనుఁగులు భటులుఁ ♦ దేరులు నేలా?

తా. కవి పద్యాదిని జగణము, లేక రగణంబును నుంచి యొకరాజును గొనియాడినయెడల, నారాజునకు యుద్ధంబున జయంబు గలుగును. అట్లుండ గుఱ్ఱములు, ఏనుఁగులు, భటులు, రథంబులు నివియన్నియు నేల?

మగణముతో మగణమును, మగణముతో
సగణముం జేరిన ఫలంబు.

క. మగణముతోఁ బద్యాదిని
మగణము గదిసినను ధరణి♦మండల మెల్లన్
బొగడొంద నేలుఁ గృతిపతి
సగణము గదిసినను గీర్తి ♦ జగముల వెలయున్.

తా. పద్యాదిని మగణము చెప్పి రెండవ గణమును మగణమును జెప్పినకృతిపతి యగురాజు భూమండలం బెల్ల నేలును. ఆలాగు రెండవగణము సగణముగా నున్న నాకృతిపతి యగు రాజుయొక్క కీర్తి నలుదిక్కులందును వ్యాపించును.

మగణ యగణయోగంబునకు ఫలంబు

క. మించులు గిరికొను ముత్యము
గాంచనముం గదిసినట్టి గతి నలయగణం
బంచితముగఁ దనుఁ గదిసిన
మంచిదియై లక్ష్మి నొసఁగు మగణము పతికిన్.

తా. కృతి మొదటిపద్యము మొదట మగణంబును బెట్టి దానికి ప్రక్కనుయగణంబును జెప్పినచో బంగారుతోఁగూడిన మంచిముత్తెము చొప్పున వెలుఁగుచు రాజునకు మేలుచేయును.

రగణ యగణయోగమునకు ఫలంబు.

క. పొగ డొందఁ బద్యముఖమున
రగణము యగణంబుఁ గూడి రాజిల్లినచో
జగ మంతయు నేలెడివాఁ
డగుఁగృతిపతి విభవయుక్తుఁడగుఁ గవివరుఁడున్.

తా. రగణము దుష్టగణ మైనను యగణముయొక్కకూడిక బలిమివలనఁ గృతిపతికి రాజ్యంబును,గవీశ్వరునకు విశేషసంపదయుం గలుగును.

రగణ జగణయోగంబునకును,

రగణ తగణయోగంబునకును ఫలంబు.

క. ఇంగల రగణము జగణము
సంగడమున నొండె తగణసంగతి నొండేన్

మంగళకర మని పద్యము

ముంగలఁ జెప్పుదురు సుకవి♦ముఖ్యులు గృతులన్.

తా. రగణ జగణములను గాని, రగణతగణములను గాని చేర్చిన మేలు గలుగును గాన,కవీశులు గ్రంథాదిపద్యములందు వానిని జెప్పుదురు.

అవ. పద్యాదియందు నిల్పిన జగణమునకు గ్రహమైత్రిగలగణము దగ్గఱ నుండెనేని శుభంబు గలుగునని చెప్పుచున్నాఁడు.

క. ఆరోగ్యకరుఁడు భాస్కరుఁ

డారయ జగణమున కొడయుఁ, డది మొగినిడఁగా

నీరోగము పైకొన చా

చేరువచుట్టంపుగణముఁ ♦ జేకొనఁజాలున్.

తా. సూర్యుఁ డారోగ్యము నిచ్చువాఁడుగాన సూర్యుఁ డధిపతి గాఁ గలజగణము దాపున నున్న గణము చెడ్డదైనను మంచిఫలముస్నే యిచ్చును.

తగణ యగణ సంయోగ నిషేధము.

క. మొగివాత తగణ ముండిన

వగవక యగణంబు దాని♦వద్దనె నిలుపన్

దెగి తన్నుఁ జంపఁ దలఁచిన

పగవారికి నైనఁ దగదు ♦ పద్యముఁ జెప్పన్.

తా. గ్రంథాది పద్యము మొదట తగణయగణములం జేర్చినఁ దప్పక మరణము సంభవించును గాన నట్టి తగణయగణసంయోగంబు గూడదు.

మగణ జగణసంయోగమునకు, మగణసగణ
సంయోగమునకును ఫలంబు.

క. ముందట నిల్పిన మగణము
క్రిందర జగణంబు గదియఁ ♦ గీలించిన మే
లొందుర సగణం బటువలెఁ
బొందించిన విభుఁడు రిపులఁ ♦ బోరజయించుర.

తా. మగణమును బద్యాదిని నిల్పి దానివెంబడి జగణమును గాని సగణమును గాని చెప్పినఁ గృతిపతికి సంపదలు, జయంబునుం గలుగును.

యగణ జగణ సంయోగనిషేధము.

క. శంకింపక యగణముతోఁ
బంకజహితగణము గదియఁ ♦ బద్యముఁ జెప్పర
బొంకము నెడి విభుఁ డొరులకుఁ
గింకరుఁడై దిక్కులేక ♦ గీడ్పడి యుండుర.

తా. యగణముతో జగణముంజేర్చి చెప్పిన గృతిపతి రాజ్యభ్రష్టుఁడై యితరులకు సేవ సేయుచు దారిద్ర్యము ననుభవించును.

అవ. గ్రంథాదియందు తగణము మంచిదని చెప్పిన
భీమనమతంబుఁ దెల్పుచున్నాఁడు.

ఆ. ఆది తగణ మొప్పునది దేవతాగణం
బరసి చూడ దాని ♦ కమరగురుఁడు

గ్రహముగానఁ బద్య♦గద్యముఖంబుల
వంచి దనుచు భీముఁ ♦ డెంచినాఁడు.

అవ. సగణ తగణంబులు, సగణ జగణంబులు పద్యా
దిం బ్రయోగింపరాదను చున్నారు.

క. మారుతగణంబు సంప
త్కారణ మగుజతగణములఁ♦గదిసినచో నా
మారుతగణంబు జతగా
నారవిగణ మున్నఁ బతికి ♦ నలమట వచ్చుఁ.

తా. పద్యాదియందు సగణ జగణములను గాని, సగణతగణములంగాని చేర్చిచెప్పినఁ గృతిపతికి హాని కలుగును.

సగణ రగణ సంయోగనిషేధము.

క. మారుతగణంబుజత నం
గారప్రగణ మున్నఁ బతి మృ♦గంబులచేతన్
చోరులచే శత్రులచే
ధారుణిఁ జెడు మందిరంబు ♦ దరికొని కాలున్.

తా. వాయుదేవతాక మైనసగణంబును, నగ్ని దేవతాకమైన రగణంబునుం జేర్చి పద్యము సెప్పినచోఁ గృతిపతి సకలబాధలం జెందును. క్షామబాధ లెచ్చును. ఇండ్లు తగులఁబడి పోవును.

నక్షత్ర ఫలంబు (కవిగజాంకుశము).

క. కమలహితుఁ డున్ననక్ష
త్రము మొదలుగ నేడుదోష♦తమములునదుమన్

ప్రమదప్రదములు పద్రెం
డమరఁగ నశుభములు తొమ్మిదగుఁ బద్యాదిన్.

తా. సూర్యుఁడున్ననక్షత్రము మొదలుకొని యేడు దుష్ట నక్షత్రములు. ఎనిమిదవనక్షత్రము మొదలుకొని పండ్రెండు నక్షత్రములు శుభప్రదంబులు. ఇరువదవనక్షత్రము మొదలుకొని యభిజిత్తుతోఁ గూడఁ దొమ్మిదినక్షత్రము లశుభప్రదంబులు.

గ్రహనక్షత్రములకు మృతజీవసంజ్ఞ(శ్రీధరఛందము)

క. విదితముగ రాహుభుక్తిని
నొదవినపదుమూఁడు జీవయుక్తము లందు
న్నది యావల నెరితారలు
పదునాలుగు మృతము లనఁగఁబడు నెల్లెడలన్.

తా. గ్రహణంబు పట్టిననక్షత్రంబు మొదలు పదుమూఁడు నక్షత్రములు జీవనక్షత్రంబులు. తక్కినపదునాలుగు మృత నక్షత్రములు.

జీవమృతనక్షత్రములకు ఫలంబు.

క. పతి మృతుఁ డగు బద్యాదిని
మృతనక్షత్రంబు నిడిన మేదురసౌఖ్యా
న్వితుఁ డగు నమృతము లనఁగం
బ్రతిమము లగుతారకములఁ బద్యాది నిడన్.

తా. మృతనక్షత్రము కృతిపతికి మరణంబుఁ దెచ్చును. అమృతనక్షత్రము కృతిపతికి సేమముఁ గావించును.

(గోకర్ణ ఛందము.)

క. క్రూరగ్రహము క్తము లగు
తారలు దగ్ధములు ధూమితంబులు వానిఁ
జేరి మొదు రెదుర నున్నవి
క్రూరగతంబు లని మెఱఁగికొను జ్వలితంబుల్.

తా. సూర్యాంగారకశనిరాహుకేతువులు విడిచి పెట్టిన నక్షత్రంబు లవియేవి యనిన అశ్వినియందుండె నేని రేవతియు, భరణియందుండె నేని అశ్వినియు, కృత్తికయందుండె నేని భరణియు నిట్లన్ని నక్షత్రంబులకు నూహింపవలయును. ఎదురు అనఁగా పాపగ్రహములు విడిచిపెట్టిననక్షత్రంబునకుఁ బదుమూఁడవనక్షత్రము. అదియుంగూడదు. ఈ నక్షత్రములందుఁ గవిత్వారంభము సేయరాదు.

దగ్ధ, ధూమిత, జ్వలితనక్షత్రంబులకు ఫలంబులు.

ఆ. ధనముఁ గోలుపుచ్చు దగ్ధనక్షత్రంబు
చావు చేటుఁ దెచ్చు జ్వలితతార
ధూమితంబు మార్తిఁ జేయు నప్పుడు
గాన మొదల నిల్పఁ గాదు వీని.

తా. పాపగ్రహంబులు విడిచినది దగ్ధనక్షత్రంబు. వారున్నది ధూమితనక్షత్రము. వారున్న నక్షత్రమునకుఁ బదుమూఁడవది జ్వలితనక్షత్రము. ఈమూఁడునక్షత్రములు గలగణములను బద్యము మొదలఁ బ్రయోగింపఁగూడదు. కవిత్వారంభకాలమున వీనిని బరిశోధించి గ్రంథాదియందు గణములఁ బ్రయోగింపనగును.

### ఈ జీవనిర్జీవనక్షత్రములకు ఫలంబు.

క. మొదలనె జీవగణం బిడఁ
గొదలేక కృతీశు బ్రదుకు • గొనసాగు మదిన్
వెదకక నిర్జీవగణం
బదికిన నపు డాకృతీశు • కాయువు దఱుఁగున్.

తా. జీవనక్షత్రంబు గల గణంబు మొదటఁ బ్రయోగించెనేనిఁ గృతిపతి దీర్ఘాయుష్మంతుఁ డగును, నిర్జీవనక్షత్రము గలగణంబుఁ బ్రయోగించెనేని యాయువు నశించును.

### మఱియు దానికిఁ గల ఫలము.

క. కృతిమొదల దగ్ధతారయుఁ
బతి నతిదుఃఖితునిఁ జేయు • బ్రజ్వలితంబున్
మృతిఁ బొందించును మఱి ధూ
మితనక్షత్రంబు నతని • మేనలయించున్.

తా. కృత్యాదియందు దగ్ధనక్షత్రముగలగణం బిడినఁ గృతిపతికి దుఃఖము సంభవించును. జ్వలితనక్షత్రగణ మిడిన నతనికి మరణము సంభవించును. ధూమితనక్షత్రంబు గల గణ మతనికి రోగముఁ దెచ్చును.

### లక్షణ మెఱుంగనికవికి ఫలము.

క. పతితారకు సంబంధ
స్థితిఁ దారకుఁ జెల్లు కీడు • చింతింపక దు

ర్మతిఁ గవిత చెప్పఁ దివిరెడు
నతఁడె సుమీ కవిపిశాచ ♦ మారయ నుర్వీ.

తా. కృతిపతియొక్క నక్షత్రమునకును గణముయొక్క నక్షత్రమునకును మైత్త్రి యుండవలయు. ఆమైత్త్రి తెలియక లక్షణజ్ఞానములేక కవిత్వము సెప్పువాఁడు దయ్యమనఁబడును.

గ్రహరాశి గణరాసుల మైత్త్రియొక్క ముఖ్యత.

క. తొలుత గణగ్రహమైత్త్రులు
దలఁపఁ ద్రికోణాధిపతులు ♦ తత్తద్గ్రహరా
సులగణము వారణమ్మునఁ
గలసిన చుట్టంబు లవియె ♦ గ్రహగణమైత్త్రుల్.

ఆ. ఏయవస్థనుండి ♦ యేవేళ నేగ్రహ
మేశుభాశుభంబు ♦ లిచ్చుచుండు
నాయవస్థనుండి ♦ యావేళ నాగణ
మాశుభాశుభంబు ♦ లందఁ జేయు.

శుభగ్రహపాపగ్రహసంబంధమునకు ఫలము.

ఆ. గ్రహము పొత్తుకలిమి♦గలగణసంగతి
నుండి క్రూరగ్రహము♦నొందు శుభము
గ్రహము పొత్తు లేని♦గణముతోఁ బద్యాదిఁ
గూడి మంచిగణము ♦ కీడు సేయు.

తా. నైసర్గికదుష్టగ్రహగణమైనను మైత్త్రిగలగణంబుతోఁ గూడె నేని యదియును మంచి గణమేయగును. మఱియు గ్రహ

మైత్త్రి లేనిగణముతోఁ గూడినది మంచిగణ మయినను కీడునే కావించును.

## మగణాదిగణంబుల గ్రహమైత్త్రి.

క. మగణాదిగణంబులకును
బగయును మైత్త్రియునెఱుంగఁబడుసుకవులకుఁ
జగమునఁ దత్తద్గ్రహముల
పగయును మైత్త్రియును శాస్త్రపద్ధతిఁగనఁగాఁ.

తా. గణములయొక్క గ్రహములకు మిత్త్రిత్వ శత్రుత్వములు దెలియక కవి కావ్యముఁ జెప్పరాదు. కావున శాస్త్రముఁ జదివి లక్షణములం బరిశీలించి గణగ్రహమైత్త్రి నెఱుంగ వలయును.

## నైసర్గికశుభపాపగ్రహంబులు.

ఉ. వారిజమిత్త్రిసూనుఁడును
వారిజమిత్త్రుఁడు భూమిపుత్త్రుఁడుఁ
గ్రూరులు వారిఁ జేరునెడఁ
గ్రూరుఁడు చంద్రతనూభవుండు బృం
దారక రాజమంత్త్రియును
దైత్యగురుండును సౌమ్యుఁడు న్విధుం
డారయఁ గృష్ణపక్షతిథు
లందు శుభప్రదు లెన్ని చూఁడగఁ.

తా. శనైశ్చరుఁడు, సూర్యుఁడు, అంగారకుఁడు క్రూరులు. బుధుఁడు మంచివాఁడయినను పాపగ్రహములతోఁ జేరెనేని క్రూరుఁడగును. బృహస్పతి, శుక్రుఁడు, పాపగ్రహసంబంధము లేనిబుధుఁడును శుక్లకృష్ణపక్షమధ్యమునం దుండెడి చంద్రుఁడును శుభగ్రహంబులు.

## గ్రహముల వర్ణము.

ఆ. శుక్రశశులు తెలుపు ♦ శోణితవర్ణులు
తరణికుజులు బుధుఁడు ♦ సురగురుండు
పసిఁడివన్నెవారు ♦ భానుజరాహువులు
సలిలజలధరంబు ♦ ఛాయవారు.

తా. శుక్రుఁడు, చంద్రుఁడు తెల్లనివారు. సూర్యుఁడు, అంగారకుఁడు నెఱ్ఱనివారు. బుధుఁడు, బృహస్పతి బంగారుఛాయ గలవారు. శని రాహుకేతువులు నల్లనిఛాయ గలవారు.

## చంద్రునకుఁ గలప్రత్యేకఫలము.

చ. ఉడుపతి యేగ్రహంబు కడ
నున్నను దానును వానివన్నెయుఁ
నడుమను నాశుభంబుగ గ
ణంబులలోపల నేగణంబు సం
గడి భగణంబు నిల్పు నధి
కంబుగ నాఫలమిచ్చు నవ్విధుం
డొడయఁడు గాన దానికిని
యుక్తము యంద్రు కుయుక్తు లేటికిన్.

తా. చంద్రుఁడు తాను గూడుకొన్న గ్రహంబు యొక్క వన్నె గలవాఁడగును. భగణం బేగణంబుతోఁ గూడుకొనిన నా ఫలం బిచ్చును గాన దాని కధిపతి యగుటవలనఁ జంద్రుఁడు నట్టిఫలము నే యొసఁగును.

చంద్రునివన్నెకు ఫలము.

ఆ. శ్వేతచంద్రుఁ డయిన • సేమంబు గావించు
రక్తచంద్రుఁ డయిన • రణ మొనర్చుఁ
గృష్ణచంద్రుఁ డయిన • క్రూరత లొడఁగూర్చుఁ
బీతచంద్రుఁ డయిన బ్రియ మొనర్చు.

తా. తెల్లనిచాయ గలచంద్రుఁడు క్షేమంబును, ఎఱ్ఱనిచాయ గలచంద్రుఁడు కలహమును, పచ్చనిచంద్రుఁడు ఇష్టార్థలాభంబునుగలిగించును గాన పచ్చ తెల్లనిచంద్రుఁడు శుభుఁడు. ఎఱ్ఱని నల్లని చంద్రుఁడు పాపుఁడు.

మగణంబు మొదలగునెనిమిదిగణములకు ఫలము.

క. సరసాన్న రుచిరభూషణ
పరితాపస్థానచలన • బహుదుఃఖరుజా
పరమాయురచలలక్ష్మీ
కరములు మయరసతజభన • గణములు వరుసన్.

తా. మగణమునకు షడ్రసములతోఁ గూడినమధురాన్నమును, యగణమునకు విశేషాలంకారమును, రగణమునకు దుఃఖమును, సగణమునకు స్థానభ్రంశమును, తగణమునకు బహు

దుఃఖములును, జగణమునకు రోగములును, భగణమునకుఁ బూర్ణాయువును, నగణమునకు తరుగనిసంపదయు ఫలంబులు వరుసగాఁ జెప్పఁబడియున్నవి గాన గ్రంథము మొదటిపద్యము ను మంచిఫలము నిచ్చుగణముతో నారంభింపవలయును.

## యోనికూటము.

క. హరిణివలీముఖమహిషీ
వరసైరిభ మేష ధేను ♦ వాతాశనులుꣳ
వరుసను మయరసతజభల
కరయఁగ నక్షత్రయోను ♦ లై విలసిల్లుꣳ.

తా. మగణమునకు లేడి, యగణమునకుఁ గోఁతి, రగణమునకుఁ గేదె, సగణమునకు దున్నపోతు, తగణమునకు మేఁక, జగణమునకు గోవు, భగణమునకు సర్పము యోనులు. నగణమునకుఁ బాదాంగచూడామణియందునక్షత్రము చెప్ప లేదుగానిసకలైశ్వర్యముల నొసఁగునట్టి గుణమని పెద్దలు చెప్పుదురు.

## గణములచాయలు.

క. రవి తురగ రజత విద్రుమ
కువలయ హరినీల శకల ♦ కురువింద సుధా
ర్ణవ కనక నికష రేఖా
ప్రవిమలకాంతులఁ దనర్చుఁ♦బరువడి గణముల్.

తా. మగణము పచ్చనిచాయయును, యగణంబు వెండి చాయయును, రగణము పగడఁపుజాయయును, జగణంబు కలువ చాయయును, తగణమింద్రనీలపుఁజాయయును, జగణంబుగురివింద గింజచాయయును, భగణంబు పాలసంద్రపుఁజాయయును, నగణము బంగారుచాయయునుఁ గలదై యుండు.

## శ్రీ సు ల క్ష ణ సా ర ము

సంపూర్ణము.

---

'వావిళ్ల' ప్రెస్, తండయార్పేట, చెన్నపురి.—1920.

# ఆంధ్ర గ్రంథములు.

| | ప్రతి 1-కి రు. | అ. |
|---|---|---|
| ఆంధ్రభారతము—3 సంపుటములు | 12 | 8 |
| ,, ఆది, సభాపర్వములుగల సంపుటము | 2 | 4 |
| ,, అరణ్యపర్వముగలసంపుటము | 2 | 0 |
| ,, విరాటోద్యోగపర్వములుగలసంపుటము | 2 | 0 |
| ,, భీష్మద్రోణ పర్వములు... | 2 | 0 |
| ,, కర్ణశల్యసౌప్తికస్త్రీపర్వములు | 2 | 0 |
| ,, శాంతిపర్వము ... | 2 | 0 |
| { ఆనుశాసనిక అశ్వమేధ ఆశ్రమవాస మౌసల మహాప్రస్థానికస్వర్గారోహణపర్వములుగలసంపుటము } | 2 | 0 |
| ,, ఆదిపంచకము, ఒకటేసంపుటము | 5 | 8 |
| ,, యుద్ధపంచకము ... | 3 | 8 |
| ,, శాంతిసప్తకము ... | 3 | 8 |
| ఆంధ్రభారత విమర్శనము ... | 0 | 8 |
| శకుంతలాపరిణయము, కృష్ణకవికృతము ... | 0 | 12 |
| తెనుఁగుసమస్యలు, చక్కనికూర్పు ... | 0 | 2 |
| లంకావిజయము, (రావణదమ్మీయము), సటీక, పిండిప్రోలు. లక్ష్మణకవికృతము, కాలికోబైండు ... | 1 | 8 |
| కృష్ణరాయవిజయము, ధూర్జటి కవికృతము ... | 0 | 8 |
| భాస్కరరామాయణము, చక్కనికూర్పు ... | 3 | 8 |
| నిర్వచనోత్తరరామాయణము ... | 1 | 4 |
| ఉత్తరరామాయణము, కంకంటి. పాపరాజప్రణీతము | 2 | 0 |
| గోపీనాథరామాయణము, శ్రీమద్రామాయణమునకు సరియైన పద్యకావ్యము. కవనము మిక్కిలి సొంపుగానుండును. రెండుసంపుటములు | 5 | 8 |

| | | |
|---|---|---|
| అచ్చ తెనుఁగు రామాయణము, శుద్ధప్రతి ... | 1 | 4 |
| రంగనాథరామాయణము, ద్విపద, చక్కనికూర్పు | 3 | 8 |
| మొల్లరామాయణము, చిన్నసైజున పెద్దక్షరములతో చక్కఁగ ముద్రితము ... | 0 | 12 |
| మార్కండేయపురాణము, మారనకృతము ... | 1 | 12 |
| వసుచరిత్ర, సవ్యాఖ్యానము, దళసరికాగితములు, చక్కనికూర్పు ... | 3 | 8 |
| వసుచరిత్ర విమర్శనము, అత్యద్భుతములగు క్రొత్తవిషయములనేకములిందుగలవు ... | 1 | 0 |
| రాఘవపాండవీయము, సటీక, చక్కనికూర్పు | 2 | 4 |
| శృంగారనైషధము, శ్రీనాథకవిది ... | 0 | 14 |
| కాశీఖండము ... | 1 | 8 |
| ఆంధ్రభాగవతము, పోతనామాత్యప్రణీతము, ఇదివఱకు ముద్రితమైనప్రతులకన్న అన్నివిధములబాగుగనున్నది | 4 | 0 |
| డిటో మేలుప్రతి, చక్కనిబైండు ... | 6 | 8 |
| డిటో అత్యుత్తమప్రతి ... | 8 | 0 |
| మనుచరిత్ర, సటీక, వావిళ్ల. రామస్వామిశాస్త్రిగారి వ్యాఖ్యానముతో చిన్నసైజున మేలుకాగితములమీఁద స్ఫుటమైన అక్షరములతో చక్కఁగ ముద్రించియున్నాము. శ్రీకృష్ణదేవరాయలయొక్క ప్రతిమ యిందుగలదు. | 2 | 0 |
| ప్రభావతీప్రద్యుమ్నము, క్రొత్తకూర్పు ... | 0 | 12 |
| హరవిలాసము ... | 0 | 12 |
| హరిశ్చంద్రనలోపాఖ్యానము, సటీక, పీఠికవిపులము | 2 | 8 |
| ఆముక్తమాల్యద, వావిళ్ల. రామస్వామిశాస్త్రిగారి వ్యాఖ్యానముతో మేలుకాగితములమీఁద చక్కఁగ మరల ముద్రించినారము ... | 3 | 8 |
| సారంగధరచరిత్రము, చేమకూర. వేంకటకవికృతము | 0 | 12 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| కవికర్ణరసాయనము, మాంధాతచరిత్ర ... | 1 | 8 |
| నిరంకుశోపాఖ్యానము, రుద్రకవికృతము ... | 0 | 6 |
| రాజయోగసారము, ద్విపద ... | 0 | 4 |
| కళాపూర్ణోదయము, దళసరికాగితములు ... | 2 | 0 |
| నరసభూపాలీయము, అట్టబైండు ... | 0 | 10 |
| విజయవిలాసము, చేమకూర. వేంకటకవికృతము | 0 | 8 |
| బిల్హణీయము, చక్కనికూర్పు ... | 0 | 8 |
| వైజయంతీవిలాసము ,, ... | 0 | 8 |
| రంగరాయచరిత్ర, దిట్టకవి. నారాయణకవి ప్రణీతము | 0 | 8 |
| రామాభ్యుదయము, అయ్యలరాజు. రామభద్రకవికృతము | 1 | 8 |
| నీలాసుందరీపరిణయము, కూచిమంచి. తిమ్మకవికృతము | 0 | 4 |
| రసికజనమనోభిరామము, శుద్ధప్రతి ... | 0 | 12 |
| రుక్మిణీపరిణయము ,, ... | 0 | 6 |
| రాజశేఖరవిలాసము, కూచిమంచి. తిమ్మకవిది. | 0 | 8 |
| పారిజాతాపహరణము ... | 0 | 8 |
| హరిశ్చంద్రోపాఖ్యానము, శంకరకవిప్రణీతము | 0 | 12 |
| అనిరుద్ధచరిత్ర, కనుపర్తి, అబ్బయామాత్య ప్రణీతము | 0 | 8 |
| విక్రమార్కచరిత్ర, జక్కనకవిప్రణీతము ... | 1 | 4 |
| సీతారామాంజనేయసంవాదము, సటీక. అనేక నూతనాంశములు చేర్చి చిన్నసైజున ముద్రించినారము. టీక, వివరణము మిక్కిలి విపులము. ఈవఱకు ప్రకటితమైన ప్రతులకన్న బాగుగనున్నది. సాధారణప్రతి ... | 2 | 0 |
| వేంకటాచలమహాత్మ్యము, తరిగొండ వెంకమ్మప్రణీతము, చక్కనికూర్పు ... | 1 | 2 |
| పంచతంత్రము, నారాయణకవికృతము ... | 0 | 12 |
| జైమినిభారతము, అశ్వమేధపర్వము, చక్కనికూర్పు | 1 | 0 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| ఉత్తరహరివంశము, నాచన సోమనాథకృతము | 1 | 8 |
| నృసింహపురాణము, ఎఱ్ఱాప్రెగ్గడ, క్రొత్తకూర్పు | 0 | 12 |
| రుక్మాంగదచరిత్ర, ఏకాదశీమాహాత్మ్యము ... | 0 | 10 |
| సులక్షణసారము, సటీక ... | 0 | 10 |
| ఆంధ్రబ్రహ్మాండపురాణము ... | 5 | 0 |
| దసరాపద్యములు ... | 0 | 2 |
| ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు—టీకానుక్రమణికాసహితము, మేలుప్రతి | 0 | 12 |
| డిటో కాలికోబైండు ... | 1 | 2 |
| అప్పకవీయము, చక్కనికూర్పు ... | 1 | 10 |
| బసవపురాణము, పిడుపర్తి. సోమనాథకృతము | 2 | 0 |
| వేమనపద్యములు, చక్కనికూర్పు ... | 0 | 6 |
| డిటో బ్రౌనుదొరగారి ఇంగ్లీషుతో ... | 1 | 0 |
| ఆంధ్రలలితోపాఖ్యానము ... | 1 | 8 |
| సప్తమస్కంధము, సటీక, చిన్నసైజు ... | 1 | 4 |
| కుచేలోపాఖ్యానము, సటీక, (భాగవతము) ... | 0 | 4 |
| డిటో గట్టుప్రభువుకృతము ... | 0 | 6 |
| మాతృశతకము ... | 0 | 2 |
| సుమతిశతకము, సటీక ... | 0 | 3 |
| కుమారీశతకము సటీక ... | 0 | 3 |
| దాశరథిశతకము ... | 0 | 4 |
| మానసబోధశతకము ... | 0 | 3 |
| భాస్కరశతకము ... | 0 | 4 |
| కలువాయిశతకము ... | 0 | 4 |
| జగన్నాయకశతకము ... | 0 | 2 |
| కవిచౌడప్పశతకము ... | 0 | 2 |
| నృసింహశతకము ... | 0 | 2 |





| | ప్రతి 1-కి | రూ. | అ. |
|---|---|---|---|
| చంద్రశేఖరశతకము | ... | 0 | 2 |
| రామలింగేశశతకము, అడిదము. సూరకవిది | .. | 0 | 3 |
| శ్రీకాళహస్తీశ్వరశతకము, ధూర్జటికవిది | ... | 0 | 2 |
| కుక్కుటేశ్వరశతకము, కూచిమంచి. తిమ్మకవిది | | 0 | 3 |
| దేవకీనందనశతకము | ... | 0 | 2 |
| కృష్ణశతకము | ... | 0 | 2 |
| నారాయణశతకము | ... | 0 | 2 |
| శ్రీకాళహస్తిశతకము ('సాంబశివా మహాప్రభో') | | 0 | 2 |
| సింహాద్రినారసింహాశతకము | ... | 0 | 3 |
| భద్రాద్రిరామశతకము, పావులూరి. మల్లనకృతము | | 0 | 2 |
| ప్రసన్నరాఘవశతకము | ... | 0 | 3 |
| చిత్తబోధశతకము | ... | 0 | 3 |
| అంబరీషోపాఖ్యానము, సటీక, (భాగవతము) | | 0 | 4 |
| భోగినీదండకము, బమ్మెర. పోతరాజప్రణీతము | | 0 | 2 |
| గజేంద్రమోక్షము, సటీక, చక్కనికూర్పు | ... | 0 | 3 |
| రుక్మిణీకల్యాణము, సటీక, చక్కనిప్రతి | | 0 | 3 |
| నలోపాఖ్యానము, సటీక, చిన్నసైజు | ... | 0 | 3 |
| నలచరిత్ర, ద్విపద | ... | 0 | 14 |
| శ్రీనాథునివీథినాటకము | ... | 0 | 2 |
| విదురనీతి, సటీక, ఆంధ్రభారతములోనిది | ... | 0 | 5 |
| ఆంజనేయదండకము, హనుమద్దండకము | ... | 0 | 2 |
| చాటుపద్యమణిమంజరి, క్రొత్తకూర్పు | ... | 1 | 4 |
| వెంకయ్యవ్యాకరణము | ... | 0 | 3 |
| ప్రౌఢవ్యాకరణము | .. | 0 | 12 |
| బాలవ్యాకరణము, చిన్నయసూరిగారిది | ... | 0 | 12 |

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

292 ఎస్ప్లనేడ్, చెన్నపురి. ఈ.